# NARAJU

(A ROMANTIC NOVEL)



BY

TALLURI SUBBAROW,

ELLORE.

# కృతి సమర్పణము.

నాయెడల నవ్యాజకరుణ వహించి, విద్యాబుద్ధులు జెప్పించి, నన్నొక గృహస్థునిగాఁజేసి మించిన; ఆదయా సాగరుఁడు, బంధుజన కల్పద్రుమము, భాగవతాగ్రేసరుఁడు, సద్గుణ విరాజితుఁడు, రాజకార్య ధురంధరుఁడు నాబావగారు కీర్తిశేషులైన భోగరాజు లక్ష్మీనరసింహం పంతులుగారికి యీ కావ్య కన్యకను భక్తిపూర్వకముగ సమర్పించుకొనుచున్నాడను.

ఇట్లు,

గ్రంథకర్త.

# తొలిపలుకు.

ఈకథ మదరాసు సుగుణవిలాస సభవారిచే నాటక రూపమునఁ బ్రదర్శింపఁబడుట జూచితిని. అప్పటినుండియు నవలారూపమున వ్రాయవలయునని కుతూహలము కలుగ స్వశక్తిం దలంపక ప్రారంభించితిని. నాటకమునకును నవలకును మిగుల భేదముండును. ఆకారణమునఁ గావలసిన మార్పులతో నెట్లో పూర్తిజేసితిని. కథాభాగమంతయుఁ దమ రాజు నిమిత్తమనేక శ్రమలందినవారి పవిత్ర వీరచరిత్రముతోడ నిండియుండుటం జేసి గ్రంథమునకు "నారాజు" అను పేరు పెట్టఁబడినది.

అల్పజ్ఞాన వయస్కుఁడనైన నారచనయందు గుణదోషముల విమర్శించు భారము రసజ్ఞులగు సదయ హృదయులదై యున్నది.

ఏలూరు,
1—11—1932.

ఇట్లు,
తాళ్ళూరి సుబ్బారావు,
గ్రంథకర్త.

శ్రీరస్తు.

# నారాజు.

## మొదటి ప్రకరణము.

"ఔరా! కాలమహిమ! కళింగ సామ్రాజ్య రత్న సింహాసనాసీన సునాశీర వైభవుఁడును, శ్రీమదిందిరానాథ చరణారవింద నిష్యందితామంద మకరంద రసాస్వాదనా మోద సుఖోన్మత్త చిత్తమధువ్రతుఁడును, నాశ్రితవిద్వదుద్యోగి ప్రముఖ నిఖిల జనసముదయత్రాణ పరాయణుఁడును, నిరతావృత యాచకచ్ఛటా కపటచాతకవ్రాత నూతనాసారాయిత దైనందిన దాన ధారాపటలుఁడును, శరణాగత రక్షణ విచక్షణా క్షీణ నిర్లక్షితాంబుజాక్షుఁడును, నిరుపమ కరుణారస సాగరుండును, నగు విక్రమాదిత్య మహారాజిట్టి దుర్మరణము నందవలసినవాఁడేనా? అవురా! రాజ్యకాంక్ష యెంతచేసినది! అక్కటా! నిజసోదరుఁడైన విక్రమాదిత్యుని విషప్రయోగముఁ జేయించి చంపుటకా మదాలస చిత్తమెట్లు సమ్మతించెనో కదా! నిశ్చయముగా నీమెనొక రాక్షసిగాఁ దలంపవలయును. కాకున్నఁ గళింగసామ్రాజ్యమంతయుఁ దన నెత్తిపైఁ బెట్టుకొని యూరేగవచ్చునని భావించియేకదా సోదరుండనియైన భావింపక రాజేంద్రునిఁజంపి, స్వాతంత్ర్య

మునకేమయిన భంగ మొదవునేమో యని భర్తనుగూడ యమపురికంపినది. సుదాలసా! ఇంక నెన్ని దుష్టకృత్యములు జేయ నెంచితివో! రాజకుమారునియెడల నేమికీడుఁ దలంచు చుంటివో! నీదుష్టకృత్యముల నెవ్వరును వారించువారు లేరా! ఆస్థానోద్యోగుల నందఱిని వశముఁ జేసికొంటివి. కూర్మమర్గా ధీశ్వరుఁడగు దుర్జయుని, నన్నును నిట్లు కారాగృహమున బంధించితివి. ఇఁక నిన్ను వారించువారెవ్వరు?" అని, యావిక్రాంతుఁడు పరిపరివిధములఁ జింతించుచుండెను.

రాత్రి రెండు ఝాములయినది. జగంబంతయు సంధ కారముచే నావరింపఁబడియుండెను. కారాగృహ రక్షకులు గూడ సంపూర్ణ నిద్రావస్థను మునింగి యుండిరి. కాని, విక్రాంతునకు మాత్రము నిద్రరాలేదు. కళింగ రాజకుమార సంరక్షణోద్యోగ భారము వహించినవాఁడై, కారాగృహం బున బంధింపఁబడిన యాతనికి నిద్రయెట్లు వచ్చును? ఆతని చిత్తము మహాదుఃఖవార్ధియందు మునింగి యుండెను. ఆతఁడు వీరాగ్రేసరుఁడే, ధైర్యచిత్తుఁడే, అయిననేమి? కారాగారమునఁ జిక్కియుండిన నాతఁడేమి సేయఁగలఁడు?

సోదరిచే విషప్రయోగముఁ జేయఁబడి, విక్రమాది త్యుఁడు మరణమును సమయమున నాతని మఱదలగు హేమాంగనను, నామెభర్తయగు విక్రాంతుని బిలిచి "ఇఁక నాజీవయాత్ర నేటితో ముగియుచున్నది. నాయేకపుత్రుఁడును

మాతృహీనుఁడును నగు చంద్రశేఖరుని మీవశముఁ జేయుచున్నాను. మీరేయికఁ వీనికిఁ దల్లిదండ్రులు. మీరు వీనినిఁ గుమారాకారముతోఁ బెంచి, పెద్దవానిగఁ జేసి, కళింగరాజ్యపీఠమున నిలిపి, మావంశము నిలబెట్టుడు. ఇట్లు మీరు సేయుదురని వాగ్దానమిచ్చితిరేని నేను సుఖముగాఁ బ్రాణములు విడిచెద" నని పలికెను. దేవాంగన విక్రమాదిత్యునిఁగాంచి "మహారాజా! నీవు మాకు రాజవగుటయే గాక నాసోదరికి భర్తవు. నీవు కుమారుని విషయమై యావంతయుఁ జింతింపవలదు. మాకింతయుఁ బ్రాణములున్నంతవఱకుఁ జంద్రశేఖరునకేమియు హాని కలుగదు. అవసరమయ్యెనేని, భవత్కుమారసంరక్షణార్థము నాప్రాణములనైన విడిచెద" నని వచించెను. విక్రాంతుఁడును దేవాంగన చెప్పినట్లే చెప్పెను. విక్రమాదిత్యుఁడు-తనకుమారుఁడగు చంద్రశేఖరుని వారివశముఁ జేసి ప్రాణములు విడిచెను.

మదాలస - విక్రాంతుని వశముఁ జేసికొనుట కాతనిని గారాగృహంబున బంధించెను. కూర్మనగరాధీశ్వరుఁడును, విక్రమాదిత్యునకు విశ్వాసపాత్రుఁడును నగు దుర్జయుఁడు గూడ నామెచే బంధింపఁబడెను. తనకుఁ గారాగృహవాసము గలిగినందులకును, జంద్రశేఖరునేవిధంబున సహాయముఁబొందకుండఁ గాపాడుదునాయనియు, విక్రాంతుఁడు దీర్ఘచింతాక్రాంతుఁడై యేమేమో యాలోచించుచుండ, నాయర్ధరాత్రి

వీరపాలుఁడు నలువురు భటులతో నయ్యెడ కరుదెంచెను. కారాగృహరక్షకభటులు నిద్రపోవుచుండుటఁ జూచి యాతఁడు వారిని గట్టిగాఁ బిలిచెను. రక్షకభటులు త్రుళ్ళిపడి లేచి కన్నులు నలుపుకొనుచు నిలబడియుండుటఁ గాంచి వీరపాలుఁడు "ఇదియేనా మీజాగరూకత! కారాగృహమునుండి యెవ్వరైనఁ దప్పించుకొని పోయినచో మీరేమిసేయుదురు? మీరిట్లుంటిరని తెలిసినచో మదాలసరాణి సైరించునా" యని భీకరముగఁ బలికెను. తరువాత నాతఁడు చెఱసాలతాళము దీయించి, విక్రాంతుని విలోకించి "విక్రాంతా! నిన్ను రాణీగారు శృంఖలాబద్ధునిగఁ జేసి తోడ్కొని రమ్మని యాజ్ఞనిచ్చె" నని నుడివెను.

విక్రాం:—రాణీగారెవరు?

వీర:—రాణీ యెవరని యడుగుచుంటివా! మదాలసయని యెఱుంగవా?

విక్రాం:—ఎఱుఁగక యడిగినాడ. నున్నించి, ఈ యర్ధనిశి యందు నన్నామె రావించుటకేమి కారణమో తెలిపెదవా?

వీర:—అదియంతయు నాకుఁదెలియదు. దుర్జయునిఁగూడ నామెకడకుఁ దోడ్కొని పోయితిమి.

ఇట్లుపలికి వీరపాలుఁడు విక్రాంతుని శృంఖలాబద్ధునిఁగఁ జేసి, రక్షకభటులు వెంటనరుదేరఁ దోడ్కొని పోయెను.

---

# రెండవ ప్రకరణము.

తొలుత మదాలస కడకు శృంఖలాబద్ధుఁడై యున్న మార్జయుఁడు గొనిరాఁబడెను. ఆమె యాతనిని గపటానురాగముచే వశముఁజేసికొన భావించి, నాతనికిఁ గట్టఁబడియున్న గొలుసులఁ దీసివేయించి, భటుల నావలకుఁ బొమ్మనెను. అనంతరము మదాలస మార్జయుని విలోకించి యిట్లుపలికెను. "మార్జయా! కూర్మదుర్గాధీశ్వరుఁడవు-అతిసుకుమారుఁడవు నగు నీకుఁ గారాగృహావాసమే సుఖముగనున్నదా? నిన్ను నేను కారాగారమునఁ బడవేసితినని నన్నుఁ గ్రూరచిత్తగా భావించుచుందువు. కాని నాభావము నేఁడు నీకు సంపూర్తిగఁ దెలియఁబఱుచఁ దలంచియే నిన్నియర్ధరాత్రి యిటకు రావించితిని. చిరకాలమునుండి నాహృదయము నీయందు లగ్నమై యున్నది నాహృదయమర్మ మెవ్వరికినిఁ దెలియకుండ నుండుటకును, లోకులు నన్నుఁగూర్చి యనుమానముఁ బొందకుండ నుండుటకును నిన్నుబంధించితిని. నేనును-నీవును నేకమైతిమేని కళింగసామ్రాజ్యము నాకువశమగుట నిశ్చయము. నామమునకు నేను రాణిగనుందును గాని సమస్తసంపదలను నీవే యనుభవింపవచ్చును. ఇన్నిమాటలేల! నన్ను నీవు సరోజనియట్లు భావింపుము. నాహృదయ మిప్పుడు నీకుఁదెలిసినదా? నేను నీవశమగుచున్నప్పుడు నీవు నావశము కావలదా!"

విక్రమాదిత్యుని మరణ సమయమున "నేనుగూడఁ జంద్రశేఖరుని సంరక్షణమున నతిజాగరూకతతో మెలంగుదు" నని, దుర్జయుఁడుగూడ వాగ్దాన మిచ్చినవాఁడే. అట్టి దుర్జయుఁడిప్పుడు మదాలస కపటమోహమును బ్రకటించుచుఁ బలికిన పలుకులు విన్నంతనే చిత్తమంతయు మారిపోయెను. తనకార్యముఁ దీర్చుకొనుటకై మదాలస యట్టి మోహము నటించుచున్నదని యాతఁడు తలంపలేదు. మూఢుఁడగు నాతఁడు తన్ను మదాలస నిజముగనే మోహించుచున్నదని మహానంద మందెను. "నేను పూర్వజన్మమున జేసిన పుణ్యములు ఫలించినవి. అందుచేతనే నాయందు మదాలస యనురాగ చిత్తయై యున్నది. ఇఁక నాకేమికొఱంత! కళింగసామ్రాజ్యమునకు రాణిగాఁ గానున్న యీమె నన్ను వరించుచున్నది. ఆహా! ఏమినాభాగ్యము! నాయందున్న మోహముచేతనే కాబోలు, విక్రమాదిత్యునకు విషమిచ్చి చంపి, భర్తను గూడ శాశ్వత పుణ్యలోకమునకుఁ బంపినది! మదాలస నాభార్య. కళింగసామ్రాజ్య మామెదైన నేమి! నాదైన నేమి! ఈమె దయ యున్నచోఁ గాలక్రమమున నేనే రాజునగుదును. ఒకప్రక్క సరోజని- వేఱొకప్రక్క మదాలస. అప్పుడు నా సౌఖ్యభోగములు మహేంద్రునకైన నుండునా!" యని యనేక తెఱంగుల దలంచుచుండెను. తనమాటలపై దుర్జయుఁడాలోచించుచున్న విధముఁజూచి, యాతఁడు తనకు లోబడు

నని మదాలస తలంచి "దుర్జయా! ఆలోచించుచుంటివేమి? ఆలోచన కిది సమయముకాదు. నేఁజేయఁదలఁచిన కార్యము నందు జయం బొందవెనేని నిన్ను వివాహమాడుదుననియే తలంపుము. కాని, ఈ సంగతి నీవు చిత్తమునందే గుప్తముగా నుంచుము. నేఁజేయు ప్రయత్నములందుఁ దోడ్పడుచుండుము. నాయెడల నిష్కపట చిత్తుఁడవై వర్తించుచుండుము. ఏదీ! చూతము. అట్లుండునని ప్రమాణము సేయు"మని పలికెను. దుర్జయుని సంతోషమునకు మేర లేకుండెను. అతఁడు మదాలసకిట్లనెను. "నాయెడల నీవు కరుణవహించి పలుకుచున్నప్పుడు నేను నీయెడలఁ గృతఘ్నుఁడనై యుందునా? అట్లన్నటికినిఁ దలంపకుము. ఈశరీరము నీకు సమర్పించుచున్నాను. నీ యిచ్ఛవచ్చిన యట్లు దీనిని వినియోగ పఱపుము. నీపాద సాక్షిగఁ జెప్పుచున్నాను. ఇఁక నన్నేమి చేయుమందువు. నీచరణముల నొత్తమందువా? నీకృప వడసిన యీతఁడం దులకుఁగూడ నానందముతో సంసిద్ధుఁడని యెఱుంగుము."

ఆహా! మోహపిశాచము సోకిన వారెట్టి కృత్యముల నైనఁ జేయ సాహసింతురుకదా! విక్రమాదిత్య మహారాజునకువిశ్వాసపాత్రుఁడైనయొకదుర్గాధీశ్వరుఁడగు-నీదుర్జయుఁడు-విక్రమాదిత్యునితోఁ దానుపలికిన మాటలను మఱచి నేఁడు మదాలసా కపటవ్యామోహపాశబద్ధుఁడై, యామెకు దాసుఁ డయ్యెను. ఈవిధంబున దుర్జయుఁడు తనకులోబడెనని సంత

సించి మదాలస యతనితో "నీతో మాట్లాడవలసిన రహస్యము లనేకములున్నవి. నీకు వానిని నెమ్మదిగా వినిపించెదను. ఇఁక నిద్రకుఁ బొ"మ్మని వానిని బంపివేసెను.

అంతఁ గొంతసేపటికి- రక్షకభటసహితుఁడై వీరపాలుఁడు శృంఖలాబద్ధుఁడైన విక్రాంతునిఁ దోడ్కొనివచ్చి మదాలసముందుఁ బెట్టెను. మదాలస విక్రాంతునిఁ గాంచి "విక్రాంతా! రాజబాంధుఁడవు; వీరపురుషుఁడవు; భాగ్యశాలివి;- అగు నిన్ను నిలబెట్టి మాటలాడుటకు నా చిత్తము సమ్మతింపదు. కావున నాయాసన మధిష్ఠింపు" మనిపలికెను. విక్రాంతుఁ డామెకు నెదురుగానున్న యాసనముపైఁ గూర్చుండెను. అంతట మదాలస యాతనింజూచి "సుగుణశేఖరుఁడవగునిన్ను బంధించినందులకు మిగుల విచారించుచున్నాను. ఇట్లొనర్చినందులకు నీవు నాపై నాగ్రహమూనవలదు. నేను తలపెట్టిన కార్యమునందు నీసహాయమే నాకు ముఖ్యమైనది.

విక్రాం:—కళింగరాజ్య సింహాసన మారోహింప నెంచుటయే కదా నీవుతలపెట్టిన కార్యము!

మదా:—అవును.

విక్రాం:—ఇందు నీకు నాసహాయము గావలయునా?

మదా:—నిశ్చయముగాఁ గావలయును. నీ యమూల్యసహాయమున నేను కృతార్థురాలను కాఁగలను.

వికాం:—నీతలంపు ధర్మమునకు వ్యతిరేకమైనది.

మదా:—వికాంతా! నీకుఁదెలియని విషయమేమున్నది? ఈప్రపంచమంతయు మిధ్య. ధర్మమను నెపమునఁ గన్నుల యెదుటఁ గనఁబడుచున్న సౌఖ్యములవిడిచి, యెప్పుడో స్వర్గసౌఖ్యము లభించునని తలంచి, శరీరము నిట్లు కష్ట పెట్టుట నీవంటి ప్రాజ్ఞునకుఁదగదు. జరిగినదానికివిచారింపక నాయుద్యమమునందుఁ బాల్గొనుము. నేఁజెప్పినట్లు వర్తించుటకు నీవు సమ్మతింతువేని, నీకుఁ గారాగృహవాస కష్టముండదు. కుబేరసంపదతో నలరారఁ గలవు. నే నింత కంటె నీకుఁ జెప్పవలసిన దేమున్నది?

వికాంతుఁడు దుర్జయునివంటివాఁడు కాడు ధైర్య సాహసములు గలవాఁడు. సత్యరతుఁడు. కార్యదీక్షగలవాఁడు. సౌఖ్యభోగ తృష్ణాపరాఙ్ముఖుఁడు. ఏకపత్నీవ్రతుఁడు. అట్టి వాఁడు- మదాలస పలుకుల కెట్లు సమ్మతించును? ఆతఁడు మదాలసం గాంచి ధైర్యచిత్తుఁడై యిట్లు పలికెను.

"మదాలసా! కళింగ సామ్రాజ్య నాశనమునకుఁ గారణ మగుచున్న నీకు నేను లొంగుదునని తలంపకుము. రాజ్యకాంక్షం జేసి నీవొనర్చిన పాతక కృత్యముల నెవ్వరు నెఱుంగరని తలంచుచుంటివి. కాని నిన్నుఁగూర్చి ప్రజలేమని చెప్పుకొను చుండిరో నీవెఱుంగవైతివి. నేను నీ వాఁడనై

నీకార్యములకుఁ దోడ్పడుదునని భయపెట్టుటకై నన్ను బంధింపఁ గలిగితివి గాని, నాయాత్మను బంధింపఁ జాలవు. రాజభక్తి గలిగి చరించువాఁ డుభయలోకముల యందును బూజనీయుఁడగును. ఈదేహము లస్థిరములు. సంపద చంచలము. ఇట్టి తుచ్ఛ భోగమున కాసించి రాజభక్తిని విడనాడుట శ్రేయస్కర మగునా! ఏయేప్రమాణములు విక్రమాదిత్యునిలో గావించితినో వాని నన్నిటిని మఱచి, ప్రపంచాధిపత్యమునైన నంగీకరింపను. ఈదేహము దేనికొఱకు సృష్టింపఁ బడినదో, యది నెఱవేర్చుటయే నాకావశ్యకమైన కార్యము. ఇన్ని దినంబుల నుండియు విక్రమాదిత్యుని యుప్పుఁబులుసుఁ దిని జీవించిన నాపవిత్ర జీవితమునకు మాలిన్యము గనఁబఱచుట సమంజసమైన కార్యము కాదు. నేనిట్టి హేయభాజన మగు కార్యమునుష్ఠించితినేని నాధర్మ వర్తనమునకుఁ, బురుషార్థమునకు, గౌరవమునకు, ధైర్యసాహసములకు భంగము కలుగును. ఏమనుష్యుడు తన్నుఁదా జయించుకొనునో, ఎవ్వఁడు దూరాన్వేషణ తత్పరుఁడై పనిఁజేయునో, ఎవ్వఁడు తనరాజ్యము నందు భక్తి విశ్వాసములు కలిగి మెలంగునో, వానిని భాగ్యలక్ష్మి వరించును. ఒకరిని సంతోషింపఁ జేయుటకుఁ గాని, క్రోధపూర్వకముగాఁ గాని, లేక స్వార్థము నపేక్షించి గాని, ధర్మమార్గమున కాలవాల మగు నారాజభక్తిని విడనాడుట నామతము కాదు. నారాజభక్తిని

వెల్లడించుట కవకాశ మిచ్చుటకు తటస్థించినది. అట్లు సేయ కుంటి నేని ప్రపంచము నన్నతి నీచదృష్టితోఁ జూచును. రాజ భక్తిని విడనాడి పాపహేతువగు కార్యముఁ జేసితినేని నా యాత్మ తిరుగ విముక్తిఁ బొందుట కసాధ్యమగు నంతటి ఘోరనరక కూపమునఁ బడఁగలదు. నాసత్ప్రవర్తనచే నింతవఱ కార్జించిన యశము మన్నుగలియును. రాజభక్తియే సర్వసంప దల నొసంగును. అదియే సర్వాభీష్ట ప్రదము. అదియే సమస్త పాపవిమోచకము. అదియే సజ్జన స్తవనీయము. అదియె సంతో షమునకుఁ గారణము. వేయేల! దానిని మించినది భూమండల మున లేదు. సూర్యచంద్రులు గతులు తప్పినను నాచిత్త మధ ర్మోద్యోగమునఁ బ్రవేశపెట్టను."

ఏవిధముగానైన విక్రాంతునిఁ దనవశముఁ జేసికొను టకుఁ దలంచిన మదాలస తలంపున కాతఁడు వ్యతిరేకముగాఁ జెప్పుచుండెను. అయినను మదాలస యంతటితో నూరకుండక విక్రాంతునిఁ దిలకించి "విక్రాంతా! నీవు రాజభక్తుఁడవనుటకు సందియము లేదు. రాజభక్తి ప్రతివానికి నుండవలసినదే. అందులకు నేనును నొప్పుకొందును. కాని, ఆభక్తి నాపైనఁ గూడఁ జూపవలదా! నేనీ కళింగసామ్రాజ్యమున కేలిక నగు దును గదా" యనెను. అందులకు విక్రాంతుఁడిట్లు బదులు చెప్పెను. "కళింగ సామ్రాజ్యరత్న సింహాసన మారోహించుటకు బాలుఁ

డైన చంద్రశేఖరుఁడుండఁగా-నీవెట్లు స్వతంత్రురాలవయ్యెదవు? ఇందు
లకు నావంటి ధీరపురుషు లెట్లంగీకరింతురు. కళింగ సామ్రాజ్య
రమణీయ హేమరత్న సింహాసనాసీనుఁడగు విక్రమాదిత్యుని;
వైరిజన ప్రతాపాటోప గర్వభంజనుఁడగు విక్రమాదిత్యుని;
ఆశ్రితజన రక్షణ దీక్షాబద్ధ కంకణుఁడగు విక్రమాదిత్యుని;
రాజ్యకాంక్షం జేసి సోదరుఁడని తలంపక చంపిన మహా పాప
చిత్తవు. అట్టి యెడల నిష్కల్మష చరిత్రులును, ధర్మసాధులును
నగు వారెవ్వరును నీపై భక్తిం బూని యుండరు. వారణాసీ
హరిద్వార మాయాగయా ద్వారకాది పుణ్యక్షేత్రముల
దర్శించినను, జాహ్నవీ సింధు గోదావరీ శోణ నర్మదా కృష్ణ
వేణీ ప్రముఖ దివ్యస్రవంతులందు మునిగినను నీవు చేసిన
పాపమును బాయఁజాలవు ఇంకను పాపకార్యముల నేల
చేయ నెంచెదవు? ఇంతవఱకును చేసిన పాపముల క్షమింపు
మని, కమనీయ లక్ష్మీనివాస కౌస్తుభమాలాలంకృత దివ్య
వక్షస్థలుఁడును, వనమాలికా బంధుర నీలనీరద శ్యామల
కోమలాంగుఁడును, సహస్రమయూఖ దేదీప్యమాన దివ్య
ప్రభామయుఁడును, మానసబృంద సందోహ సమర్చిత దివ్య
పాదయుగళుఁడును, దేవేంద్రాది సమస్తదేవతాకోటి కోటీర
కిరీట విరాజిత సుందర పాదారవిందుఁడును, బ్రహ్మ
రుద్రేంద్రాది లోకపాలక నికరజనన హేతు భూతుఁడును,
ప్రకృతికారణుఁడును, ప్రకృతిపరుఁడును, పరాత్పరుఁడును-

నగు నా శ్రీమన్నారాయణుని వేడికొని కృతార్థురాలవు గమ్ము. అట్లుగాదేని నీవు వినాశమందుట నిశ్చయము."

విక్రాంతునిపలుకులు మదాలసకాగ్రహముఁ గలిగించి నవి. ఆమె యాతనిని దీవ్రదృష్టితోఁ జూచుచు "నీయుపన్యాసమిఁకఁ జాలించి, నేఁ జెప్పినట్లు నడచుకొందువా? నడచు కొనవా? చెప్పు" మనెను. "నీవు నన్నుఁ గారాగృహమున బంధించితివని భీతిల్లువాఁడనుగాను. పరమేశ్వరుఁ డేమిసేయఁ దలంచెనో యట్లగు"నని విక్రాంతుఁ డామెకు గట్టిగా బదులు జెప్పెను. మదాలస రక్షకభటులం జూచి "విక్రాంతుని నెప్పటి యట్లు కారాగృహంబునందుంచు" డని యాజ్ఞాపించెను. రక్షక భటులు విక్రాంతునిఁ గారాగృహంబునకుఁ దీసికొనిపోయిరి.

---

# మూఁడవ ప్రకరణము.

కళింగనగరమున-సుక్షత్రియ వంశ సంభూతయు, ధనికురాలును, నద్వితీయ సౌందర్యవతియు, యౌవనవతియు నగు మృణాళిని యను కాంతారత్నము కలదు. ఆమె యవివాహిత విక్రాంతుని యందుఁ జిత్తముఁ జేర్చి యెట్లయిన నాతనిం బరిణయమాడఁ దలంచి యుండెను. కాని, యీామె మోహమునుగూర్చి విక్రాంతునకుఁ దెలియదు. విక్రాంతుని భార్య

యగు దేవాంగనకీమృణాళినియందధికగౌరవముగలదు. ఇదియుం గాక కూర్మసర్గాధీశ్వరుఁడైన దుర్జయునిభార్యయగు సరోజని గూడనీమెకుస్నేహితురాలే. ఒకనాడీమెతనచిత్తమున "అక్కటా నాయౌవనమంతయు నడవిఁగాచిన వెన్నెలవలెవృథ యగుచున్నది. ఎట్లయినను విక్రాంతునిఁజేరి, నాయభీష్టముఁదెలిపి, యమ్మహనీయుని దివ్యపాదారవింద సేవాభాగ్యము లభింపఁ జేసికొనవలయునని తలంచుచుండఁగాఁ, గ్రూరచిత్తయగు మదాలస యాతనిని గారాగృహంబున బంధించెను. ఇఁకమీఁదను నేనేమి సేయుదును? విక్రాంతుఁడు కారాగృహమునుండి యీవలఁ బడుట యెట్లు? ఇఁకమీఁదను నేనేమి యుపాయ మూహింతును?" అని తలఁచుచుండెను. ఆ సమయంబున దుర్జయునిభార్యయగు సరోజని వచ్చెను. సరోజనియు, మృణాళినియుఁ గొంతసేపు మదాలస చేయుచున్న దుష్టకృత్యములఁ గూర్చి సంభాషించిరి.

మృణాళిని:—సరోజనీ! మదాలస నీవిభుఁడగు దుర్జయునిఁ గారాగృహ విముక్తునిఁగాఁ జేసినదని వింటిని. ఈవార్త నిజమేనా?

సరోజని:—నేనును నట్లేవింటిని కాని. విక్రాంతునిఁ జెఱ యందేయుంచి, నానాథుని మాత్రమట్లు సేయుటకుఁ గారణ మూహింపఁజాలక యున్నాను.

మృణా:—కారణమేముండును? మదాలస యొనర్చు దుష్ట కృత్యములకుఁ దోడ్పడుదునని చెప్పియుండుట చేతనే దుర్జయుఁడు చెఱనుండి విముక్తుఁడై యుండును. ఇందుల కావంతయు సందియముండదు.

సరో:—నిశ్చయముగా నానాథుఁడు మదాలసకు లోఁబడుట సంభవించెనేని, నా కాతఁడు లేనివానిగనే భావింపుము.

మృణా:—అంతమాటఁ బలికితివేమి?

సరో:—ఇది నిశ్చయమే. అధర్మమార్గమునఁ బ్రవర్తించిన వాఁడు భర్తయైననేమి? మఱెవ్వరైననేమి? అట్టివారినిఁ బరిత్యజింపవలసినదే! నేనును సుక్షత్రియ వంశమునఁ బుట్టిన దాననే. సాహస పౌరుషంబులు గల దాననే.

ఇట్లు వీరిరువురును మాట్లాడుకొనుచుండగా - విక్రాంతునకు విశ్వాసపాత్రుఁడైన కందనుఁడను సేవకుఁడొక పేటికం దెచ్చి మృణాళిని ముందుఁబెట్టి "మృణాళినీ! సంగతినంతయుఁ జెప్పుట కిప్పుడు వేళచాలదు. నేను విక్రాంతుని సేవకుఁడ. ఈపేటికను నీకడకు దేవాంగన పంపించినది. ఇప్పుడు నీవు వచ్చును నీపేటికను రక్షింపవలయును. నానిమిత్తముమదాలస పంపున భటులు వచ్చుచున్నారు. తొందరపడుము" అని పలికెను. వెంటనే మృణాళిని, పేటికాసహితుఁడైన యాకందనునిఁ దనమందిరమున నొక రహస్య ప్రదేశము నందుంచెను.

కొంతసేపటి కచ్చటికి మదాలస పంపునఁ గొందఱు భటులువచ్చి మృణాళినింగాంచి "నీమందిరమునఁ గందనుఁడు దాగియున్నాఁడని మాకనుమానముగ నున్నది. కావున మేము వెదకవలయు" నని పలికిరి. మృణాళిని వారితో "కందనుఁ డెవఁడు? నామందిరంబున దాగియుండుటేమి? అయినను మీ కనుమానమున్నది కావున వెదకుటకు నాకావంతయు సందియములేదు. మీ యిచ్చవచ్చినయట్లు నామందిర మంతయుఁ జూడుఁ"డని చెప్పెను. భటులు మృణాళిని మందిర మంతయు వెదకి కందనుని గానఁజాలక వెడలిపోయిరి. భటు లరిగిన జాడ గ్రహించి కందనుఁడు-పెట్టెతో నీవలకు వచ్చి యాపెట్టెను మృణాళిని ముందుఁబెట్టి తెఱచెను. అందు రాజకుమారుఁడైన చంద్రశేఖరుఁ డుండెను. మృణాళినియు-సరోజనియు విస్మయమందిరి. అప్పుడు కందనుఁడు మృణాళినికి "దేవాంగన యీకుమారుని నీకడకుఁ బంపినది. ఈతనిని రక్షించుభారము నీయది,'' యని పలికి, దేవాంగనవాక్యంబుల నిట్లు చెప్పెను.

"చెలీ! మృణాళినీ! నేటివఱకును-ఈకళింగ రాజవంశము నుద్ధరించుటకు నీ బాలుని నతి జాగరూకతతోఁ దండ్రి మరణించిన నాటనుండియుఁ బెంచితిని. ఈతఁడు నా సోదరీపుత్రుఁ డగుటయే గాక, విశేషించి విక్రమాదిత్యునకు మరణసమయమున మేము చేసిన శపథము ననుసరించి, యిక్కుమారుని

రక్షించి, కళింగ రాజ్యపీఠమున నాసీనుం జేయుటకు - మా ప్రాణములనైన గోలుపోవఁదలఁచితిమి నే డీతనికి మదాలసవలన హాని వాటిల్లునని యనుమానమంది నీకడకుఁ బంపితిని. ఈ బాలునకేవిధమైన హానియుఁ గలుగకుండ రక్షించు భారము నీ భుజస్కంధమునందు వహింపవలయును. కళింగ రాజవంశము నిలబెట్టి యశమందుము. నేను నిన్ను మరలఁజూచు భాగ్యమున్నదో లేదో! ఏమార్గమునఁ గుమారునకు హానికలుగకుండ నుండునో యామార్గము ననుసరింపుము. సమస్తవిషయములు దెలిసిన నీకు నేను చెప్పవలసిన యవసరము లేదు. ఏ తెఱంగుననైన మదాలస యీచంద్రశేఖరుని రూపుమాపి, కళింగరాజ్య పీఠము నారోహింప యత్నించుచున్నదను మాట మాత్రము నీవు మఱవవలదు."

కందనుఁడు దేవాంగనా వాక్యములిట్లు వినిపించి, చంద్రశేఖరుని మృణాళిని వశముఁజేసి యరిగెను. మృణాళిని దేవాంగనా వాక్యములఁ దలంచి కన్నులనీరు విడచుచు బాలు నుద్దేశించి "అక్కటా! కుమారా! నీవింత పసితనమందే తల్లిదండ్రులు లేనివాఁడవైతివి కదా! నీముద్దు ముచ్చటలు జూచుచు, విద్యాబుద్ధులు గఱపించి, యానందించు భాగ్యము నీతల్లిదండ్రులకు లేకపోయెను. విధికృతమునఁ దల్లి మరణింపఁగా నెట్లో ధైర్యము వహించి నీతండ్రి నిన్నతి గారాబముతోఁ బెంచుచుండ, గ్రూరకర్ములై రాజ్యకాంక్షఁజేసి మదాలస నీతండ్రికి విషంబిడి చంపెను. పినతల్లియగు దేవాం

గన నీకు మదాలస వలనఁ బ్రాణ భయం బొదవునని తలంచి నిన్ను నాకడ కంపెను. అక్కటా! నిన్ను నేనెట్లు రక్షింప గలుగుదును! నీ విచ్చట నుండుటఁ దెలిసెనేని మదాలసా ప్రబోధితులై భటులరుదెంచి నిన్నుఁ బట్టుకొని పోవక యుందురా! అయ్యో! పరమేశ్వరుఁడు నిన్నెట్టికష్టములపాలు సేయుచుండెను! కళింగ దేశాధీశ్వరుఁడగు విక్రమాదిత్యుని గర్భమునఁబుట్టిన నీవు దుష్టచారిణియగు మదాలసవలన భయంబునఁ జేసి పరుల పంచలను జేరవలసివచ్చెనుగదా! నిన్ను నేనిప్పుడేమిసేయుటకును దోచకున్నది," యనిచింతింపసాగెను.

సరోజని మృణాళిని విచారమునుగాంచి "మృణాళినీ! నీవీ కుమారునిగూర్చి చింతింపవలదు. నేనీతనిని నాతోఁ గూర్మమార్గమునకుఁ దీసికొనిపోవుదును. నారక్షణంబున నీతఁడు దనరఁగలఁడు. ఈతనికిఁ గొంచమైన భయంబొదవదు. నాప్రాణములతో సమానముగనీతనింగాపాడెను. దేవాంగనకు నీవెట్టిదానవో నేనుగూడ నట్టిదాననేయని తలంపు" మనెను. సరోజనివాక్యములు విని యీవిధంబునఁజేయుట మంచిదేయని మృణాళిని తలంచెను. కాని, యొకవిషయమున మాత్రమామె సంశయించెను. దుర్జయుఁడు మదాలసకు వశుఁడై యుండెను. చంద్రశేఖరునిఁ దీసికొని పోవ దలఁచినది యాతని భార్య యగు సరోజని. అట్టిచోఁ గుమారున కేమి యపాయ మొదవునో యని మృణాళిని దీర్ఘముగ విచారింపఁ దొడంగెను.

మృణాళిని యనుమానమును సరోజని గ్రహించి "ఇందులకు నీ హృదయమున నున్న యనుమానము నేను గ్రహించితిని. నీవు నన్నుఁగూర్చి సంశయింపఁ బనిలేదు. నాభర్త యధర్మ ప్రవర్తనుఁడయ్యె నేని నాకు లేనివానిగ భావింపుమని యింతకుముందే నీకుఁ జెప్పియుంటిని. నీవు నన్నుఁగూర్చి యణుమాత్రమైన సంశయింపక యిక్కుమారుని నావెంటఁ బంపుము. ఈతఁడు నాకడ సురక్షితముగ నుండును. మదాలస నీని విషయమై చేయఁదలఁచిన మాయలేమియు సాగవు. నన్ను నమ్ముము" అని వచించెను మృణాళిని యామె మాటలు విని "సరోజనీ! కళింగసామ్రాజ్య సంరక్షణమునకుఁ గంకణము గట్టుకొని తన ప్రాణములనైన నిక్కుమారునకై యర్పించుటకు నిశ్చయించుకొన్న దేవాంగన నామెడలనుండు గౌరవముచేతను, నమ్మకముచేతను నీ బాలుని నారక్షణంబు నకు బంపించినది. ఈసమయంబున నేనిందులకశక్తురాలనగుటచే నిన్ను నమ్మి నీవశముఁ జేయుచుంటిని. ఇఁక నీవు వీని నెట్లు రక్షించెదవో ! నీవును నేనును దేవాంగనా మనోరథమును ఫలింపఁజేయవలయు," నని చెప్పి చంద్రశేఖరుని నాసరోజని హస్తంబులందుఁ బెట్టెను.

ఇఁక నక్కడనున్నచో నేమైన నపాయ మొదవునేమో యని యాక్షణంబుననే సరోజని చంద్రశేఖరుని వెంటఁబెట్టు కొని, తన యనుచరవర్గముతోఁ గూర్మనుర్గమునకుఁ జనెను

# నాల్గవ ప్రకరణము.

సత్యసంధులును, ధర్మమూర్తులును, వితరణ గుణశీలురును, నగు శ్రీరామనల హరిశ్చంద్ర శిబి బలి కర్ణాది మహాపురుషులవలెనే, జగంబునఁ దమ యప్రతిమాన మహిమచేఁ గీర్తిగడించిన సాధ్వీమణులుగూడ మనకుఁ బూజ్యులే. అట్టి సాధ్వీమణులు పెక్కండ్రు సముద్రమున రత్నములవలెఁ భారత భాగవత రామాయణాది పురాణముల యందును, దదితర కావ్యముల యందును, సత్కవివతంసుల యనర్ఘవాణిచేఁ గీర్తింపఁబడి విలసిల్లుచున్నారు. పౌరాణిక యుగమునఁ దన గుణముఁ బరీక్షింప నరుదెంచిన త్రిమూర్తులను బసిబాలురుగఁ జేసి పతివ్రతా మహిమము బ్రకటించినది యనసూయ. మాండవ్యుని శాపమున సూర్యోదయ మైనంతనే తనభర్త మృతుండగునని, పద్మబాంధవుఁ నుదయింపకుండఁ జేసి లోకములకు భయము బుట్టించినది సుమతి. తన నిరుపమాన సౌశీల్యాది గుణగణముచే, నసమాన భక్తిచేఁ బతిచే సన్నుతింపఁ బడుటయేగాక, యమునిఁగూడఁ దనమృదుమధుర గంభీర భాషణంబులచేఁ జిత్తమును గరగించి, మృతుండైన భర్తను బ్రదికించుకొని, దేవతలచే శ్లాఘింపఁబడి, సతికిఁ బతిసేవయే సమస్తాభీష్టప్రదము-సకలపాప శోషణము-సౌఖ్యశ్రీల కాలవాలము - ననర్ఘ రత్నమణిమయ హారము-

ముక్తిమార్గమునని యలివేణీ జనలోకమున కుదాహరణముఁ
జూపి యశముందినది సావిత్రి. శ్రీకృష్ణునకు సతీమణియై,
యాతనితో రణ భూమి కేగి, భువనభయంకరుఁడైన
నరకునితోఁ బోరి విజయలక్ష్మిఁ గూర్చినది సత్యభామ.
దేవదానవ సంగ్రామమునఁ దనకు సాటిలేని మేటిసామర్థ్య
మున సారథ్యంబొనర్చి, నిజేశ్వరుండైన దశరథ భూపాలుని
గాపాడఁగలిగినది కైక. ఇట్టి మహిళాలలామల పవిత్ర
చారిత్రముల చే విరాజిల్లుచుండుట చేతనే భారతేతిహాస
పురాణసమితి సంతతము నవనవోజ్జీవకమై తచ్చరిత్రములు
పఠించినపుడెల్ల శరీరములఁ బులకలు వొడమి చదువరుల
కొకవిధమైన యుత్సాహము—ఆవేశము—శక్తి కలుగుచుండును.
పౌరాణికయుగమందలి వీరనారీమణుల యసమాన
చర్యలు - మహిమ - శౌర్యపరాక్రమసాహసాది గుణములు-
చారిత్రయుగమందలి మహిళల హృదయములందుఁ గూడఁ
బ్రవేశించి వారిశౌర్యాగ్నిని బ్రజ్వరిల్లఁజేసినవి. ఆమా
నవతీమణుల శౌర్యప్రకటన డిండిమ మింకను మ్రోగు
చునే యున్నది. పవిత్రమయిన యాసతీమతల్లుల దేహముల
నుండి చింది, రణరంగమునఁబడి యార్యావర్తమునకు వీర
ప్రసూత నామమును సార్థకముఁజేసి ఖండాంతర వాసులను
గూడఁ బరమాశ్చర్య నిమగ్నులుగఁ జేయజాలిన యారుధిర
బిందువులింకను నారకయుండి తత్తత్ప్రదేశములు దర్శించినపు

డెల్లఁ బ్రేక్షకులకుఁ జూపిన భారతసామ్రాజ్యవైభవము; ప్రాచీన భారత మహిళాశౌర్యము మొదలగునవి జ్ఞప్తికిఁదెచ్చి కంటనీరుఁ బెట్టింపకమానవు. చారిత్రపత్రములయందుఁ జరిత్రకారులచేఁ దమవీరచరిత్రమును సువర్ణాక్షరములచేఁ వ్రాయించుకొని, యశముండిన నారీమణులెందఱో కలరు. భారతవర్ష [illegible]ప్రపంచమున నిలిచియున్నంతవఱకు వారి పవిత్రనామములు నిలిచియేయుండును. అట్టి మానవతీమణులలో మహారాష్ట్రవంశాభరణమై, ప్రజలెల్లఁ బొగడ, రాజ్యరక్ష మతినైపుణ్యతతో నడపి ఖ్యాతివహించినది యహల్యాబాయి. పతితోఁగూడ సంగ్రామ రంగమున కవతరించి, దుర్వార శౌర్యాటోపమున విజృంభించి, పరిపంథి బలమునుఁ జెనుమాడి వీరసతి యనిపించుకొనినది సంయుక్త. ఢిల్లీశ్వరుండగు నక్బరు పాదుషా యంతటివానికి వెఱపు గలిగించినది వీరాబాయి. భయంకర సమరతలమును జొచ్చి, శరీరమునుండి రుధిరస్రవంతి పాఱుచుండినను, గండలూడిచూడినను, బ్రాణములపై నాసపడక, విజయలక్ష్మిఁ జేపట్టినఁగాని రణరంగమును విడువనని ప్రతిజ్ఞఁజేసి, చిచ్చఱమ్ములఁ బఱపుచు, వైరివీరశిరంబులతో వియచ్చరు లచ్చెరువొంద నచ్చనకాయలాడి, రాజపుత్రయోధకీర్తి లతలు దిగంతములఁ బ్రాకించినది ఝాన్సీలక్ష్మీబాయి. రాజపుత్ర సంస్థానమును దనకీర్తిచంద్రికలచే వెలయించి యపరదుర్గయని పేరొందినది దుర్గావతి. కాకతీ

యాంధ్రసామ్రాజ్య రత్నఖచిత సింహాసన మారోహించి "ఒక కాంతకు మేము లొంగియుండవలయునా" యని తలంచి గర్వించి, యెదుర్కొన్న మండలేశ్వరుల నెల్లఁ దన యసమాన శౌర్య పరాక్రమమునఁ గోటలు పెటికిన తాగ్రులవలె నదిమిపట్టి, ప్రజారంజకముగఁ బరిపాలనంబొనర్చి విదేశీయులచేఁగూడ శ్లాఘింపఁబడి యశ మందినది రుద్రమదేవి. పంటరెడ్డికులమున జన్మించి తన బుద్ధిబలముచే బల్నాటి సీమనేలు నలగామునిఁ జేరి, మంత్రిణియై, మహాబలపరాక్రమధనుఁడైన బ్రహ్మనాయనితోఁ బ్రతిఘటించినది నాగాంబ. కళింగ రాజకుమార సంరక్షణార్థము, నిజపుత్రుని విరోధుల కృపాణమునకు బలియిచ్చి, తుదకు దానుగూడ మరణమందినది దేవాంగన.

కందనునిచేతఁ జంద్రశేఖరుని మృణాళిని కడకు దేవాంగన పంపినసంగితి చదువరు లెఱుంగుదురు కదా! దేవాంగనకు వసంతుఁడను నొక్క దేపుత్రుఁడు గలఁడు. ఆతఁడు చంద్రశేఖరునకు సమవయస్కుఁడు. మందిరంబున నక్కుమారుఁడును నామెయు నుండిరి. అపాయ మొదవునని యామె చంద్రశేఖరుని మృణాళిని కడకుఁ బంపియున్న దనుమాటయే గాని, యామె చిత్తమంతయు నక్కుమారుని మీఁదనే యుండెను. అక్కుమారున కేవిధమైన హానియుఁ గలుగకుండఁ జేయుఁడని యామె దేవతల కనేకవిధముల మ్రొక్కుచుండెను.

నాథుఁడైన విక్రాంతునకుఁ గారాగృహ విముక్తి యెట్లుకలు
గునా యని యాలోచించుచుండెను. అతఁడైన నామె దగ్గఱ
నున్నచో నంతగా విచారింపఁడు. ఆమె కాలోచన జెప్పువారు
కూడ నెవ్వరును లేరు. సంస్థానమున నున్న దండనాయకులు
మొదలగు నుద్యోగులు మదాలసకు వశవర్తులై యుండిరి.
ఒక్క కందనుఁడుతప్ప నామెకు విశ్వాసపాత్రుఁడైన సేవకుఁ
డెవ్వఁడును లేఁడు. ఏమిసేయుటకును నామెకుఁదోఁచక యాలో
చించుచుండెను. అట్టిసమయమునఁ గందనుఁడు బరుగెత్తుకొని
వచ్చి గద్గదకంఠముతో "దేవీ! మదాలస పంపున వీరపాలుఁ
డిప్పుడియ్యెడకుఁ జంద్రశేఖరునిఁ జంపు నుద్దేశముతోడనో లేక
బంధించుకొనిపోవు నుద్దేశముతోడనోవచ్చునని వినియున్నాఁడ.
ఇందులకుఁ గర్తవ్య మూహింపు" మని పలికెను. దేవాంగన
కందనునిఁజూచి "కందనా! నీవు మాత్ర మెట్లకైనఁ బోయి
దాగుకొనుము. నీవిచ్చటనుంటివేని నిన్ను బంధించుకొని
పోవుదురు. నాకర్తవ్యమునకుఁ బరమేశ్వరుఁడే యున్నాఁడు.
నీ వాలసింపక పొమ్ము" అనెను. కందనుఁ డాక్షణముననే
మందిరము విడిచిపోయెను.

ఇప్పుడు దేవాంగన యేమిసేయఁగలదు? భటులతో
వీరపాలుఁ డరుదెంచి చంద్రశేఖరునిఁ జూపింపుమని యడిగిన
నేమని చెప్పఁగలదు? ఆమె తన మనంబున "విక్రమాదిత్యు
నితో నేను రాజకుమార సంరక్షణమును గూర్చి శపథముఁ

జేసితిని. ఇప్పుడు దానికి నన్యథాత్వము కలుగఁగూడదు. నా సత్యశపథమును నేను తప్పరాదు. సత్యమువలననే జగము స్థాపింపఁబడినది సమస్త ధర్మములును సత్యమునే యాశ్రయించి యుండును. మునులందఱును సత్యమునే కొనియాడుదురు కావునఁ జిత్తంబున నెట్టి సంశయంబునకును దావీయక కుమారుఁడగు నీ వసంతునే వీరపాలునకుఁ జూపించెదను. కళింగ రాజ కుమార సంరక్షణార్థము నా వంశము నిర్వంశ మైనను సరే," యని తలంచెను.

పుత్రుఁడనిన సామాన్యుఁడుగాఁడు. సమస్త సౌఖ్యవారిత తారకాగణంబునకు ననజవైరి. సంసార వారాశిఁ దరింపఁ జేయు నౌక. ముక్తిభామక సీమంతినిం గూర్చుటకుఁ దార్పులాఁడు. సత్కీర్తి శాఖల వెలయించుటను భూరుహము. అట్టిపుత్రుని నేఁడు దేవాంగన శత్రువుల కృపాణ మున కర్పింపఁ దలంచినది. ఎంతటివారికైనను నిట్టి సమయ మునఁ గొంచమైనను విచారముండక మానదు. దేవాంగన విచారమునుఁ జూచి యందులకుఁ గారణమేమని కుమారుఁ డడిగెను. కొడుకునకు దేవాంగన యిట్లనెను. "నాయనా! సంపూర్ణ చంద్రుని ధిక్కరించు నీముఖంబును జూచుచు నను దినంబును సంతోషించితిని గాని విచారము నెన్నఁడు నెఱుం గను. ఎచ్చటికేగిన నచ్చటికి నిన్ను వెంటఁబెట్టుకొనిపోయి తిని గాని యొకనాఁడును నిన్నుఁ బాసి యెఱుంగను.

శర్కరద్రాక్షారసములకంటె మధురతరమై యలరారు నీముద్దు చేత నానందమందితినిగాని యెన్నఁడును వగచి యెఱుఁగను. నేఁడు నీయందున్న ప్రేమయంతయు నావలనఁ బాఱదోలి, హృదయమునఁ గఠినత్వముఁ జేర్చి, చంద్రశేఖరుని ప్రాణసంరక్షణము నిమిత్తము, నిన్ను వైరులకు బలిగా సమర్పింపఁ దలఁచినాను. ఇందులకే విచారించుచున్నాను."

ఇట్టి దారుణవాక్యములు విన్నప్పుడెవ్వడైనను బెంగచే నాక్షణమునందే ప్రాణములు విడిచియుండును. వసంతునకుఁ దల్లిమాటలు వినినంతనే మోమునందు వికాసము హెచ్చెను. హృదయ మత్యుత్సాహపూరితమయ్యెను. ఆతఁడు తల్లిని విలోకించి యిట్లు పలికెను. "అమ్మా! ఇందులకు నీవు విచారింపవలసిన యవసర మేమియున్నది? నీవు చేయఁదలంచినది మహాపుణ్యకార్యము. జనన మరణములు దేహికి సహజములు. ఒక కాష్ఠము మఱియొక కాష్ఠముతోఁ బ్రవాహవశమున నది యందుఁ గలియుచుండును. ఒకప్పుడు విడిచిపోవుచుండును. అట్లే బంధువులతో సంయోగ వియోగములు గలుగుచుండును. సుఖమునకు మోదమందకుండుటయు, దుఃఖమునకు వగవక యుండుటయు ధీరుల లక్షణము. ఇది యట్లుంచుము. రాజకుమార ప్రాణ రక్షణార్థము నేను మరణించుట వలన నాకు శాశ్వత పుణ్యలోకము లభించుటయే గాక నా కీర్తి భూమిపై నాచంద్రతారకముగ నుండును. ఇంతకంటె నాకుఁ

గావలసిన సుకృత మేమి యున్నది ? నీ వేమియుఁ జింతింప వలదు. మృత్యు దేవతా కరాళంబును బ్రవేశించుటకు ధైర్య చిత్తుఁడనై యుందునని తలంపుము."

బాలుఁడైన వసంతుని వాక్యములు విని దేవాంగన పరమాశ్చర్య మందెను. కొంతసేపటికి వీరపాలుఁడు కొందఱు భటులతో దేవాంగనా మందిరంబును బ్రవేశించి యామెను విలోకించి "దేవాంగనా! విక్రమాదిత్య కుమారుఁడగు చంద్ర శేఖరుని మా వశముఁ జేయు" మని పలికెను. ఆ సమయంబున వసంతుఁడు—మందిరంబునకు లోపలి భాగంబున నుండెను. కన్న కొడుకును జేతులార వీరపాలుని వశముఁ జేయుటకుఁ జిత్త మున సంశయించి, యెట్లయినఁ దప్పించుకొనఁ బ్రయత్నింపఁ దలంచి యా దేవాంగన వీరపాలునిఁ జూచి "వీరపాలా! చంద్ర శేఖరుఁడు నా యొద్ద నెందుల కుండు," ననెను.

వీర:—చంద్రశేఖరుఁడు నీయొద్ద లేడా?

దేవాంగన:—ఉన్నచో నిచ్చటఁ గనుపింపఁడా?

వీర:—నీ మాయలు నాయెదుట సాగవు. నీవాకుమారుని నిచ్చటనోదాచి, నన్ను వంచింపఁ జూచుచున్నావు. నేను నిన్ను నమ్ముదునా? సత్వరముగ నాతనిందెచ్చి మాకప్ప గింపుము.

దేవాం:—లేనివానిందెచ్చి నీ కెట్లప్పగింపఁగలను?

వీరపాలుఁడు తన యనుచరులతో "ఈమె చంద్ర శేఖరుని నెచ్చటనో దాచియుండుట నిశ్చయము. మీరీమం దిర మంతయు వెదకుఁడు. ఏగది కైనను దలుపువేయఁబడి యున్నచో బ్రద్దలు కొట్టివేయుఁ"డని చెప్పెను. ఈ కలకల మంతయు విని వసంతుఁ డావంతయుఁ జలింపక, ధైర్యచిత్తుఁడై వీరపాలాదులున్న స్థలమునకు వచ్చెను. అక్కుమారునిఁ జూచిన యంతనే వీరపాలుఁడు "ఇదుగో! చంద్రశేఖరుఁడు చిక్కినాఁ" డని తలంచి, యాతనిని బట్టుకొనెను.

ఆహా! వసంతా? నీయసదృశ ధైర్యముచేత, రాజ భక్తిచేత నీజన్మము ధన్యమైనది. నీజననీజనకులు కృతార్థు లయిరి- నీయమూల్య దేశసేవ సకలజనుల హృదయ ఫలక ములందు శాశ్వతముగాఁ బ్రకాశింపఁ జేసితివి. రాజ్య సంరక్ష ణార్థము నిన్ను వైరుల కృపాణమునకు బలినీయఁ దలచితినని తల్లి చెప్పినప్పుడు, వికసితవదనారవిందుఁడవై "ధన్యోస్మి, ధన్యోస్మి'' యని పలికి, రిపులయెదుటఁ బడితివి. నీవంటి మహనీయులను గనుటచేతనే యార్యావర్తము పవిత్రభూమి యై విలసిల్లుచున్నది. బాలవీరా! వసంతా! గంగాస్రవంతీ వీచికాపరంపరలయందుఁ బావనత్వ మెందాకనుండునో, ప్రభా కరనిశాకరు లెందాక నుందురో, యంతవరకు భవదీయకీర్తి యుండుఁగాత! దేశభక్తులు నీపవిత్ర చరిత్రమును గానము సేయుదురుగాత! కవిత్వకారులు పలుతెలుఁగుల గ్రంథముల యందు లిఖింతురుగాత!

తనకుమారుఁడు వైరులచేతులలోఁ బడుటఁజూచి, యే తల్లిదుఃఖము నాపుకొనఁగలదు? కాని పొరలిపొరలివచ్చుదుఃఖ ప్రవాహమును దేవాంగన యాపుకొనెను. బంధింపఁబడినవాడు తనకుమారుండని యప్పుడు తెలిసినతో నింకేమయిన ముప్పు వాటిల్లునని యామె యేమియు మాట్లాడలేదు. కాని చిత్తము నాపుకొనఁజాలక యామె వీరపాలునిఁగాంచి యిట్లనెను. "వీరపాలా! ఇట్టి దారుణకృత్యము సేయుటకు నీచేతులెట్లు వచ్చినవి? ఇట్టి పసిబాలను బంధించుటకేనా బ్రహ్మ నిన్ను సృష్టించినాడు! నిన్న మొన్నటిదాక విక్రమాదిత్యుని యను గ్రహమునకుఁ బాత్రులైన మీరు, దుష్టచిత్తయగు మదాలస వాక్యము లాలించి నేడిట్టి ఘోరకృత్యములఁ జేయుటకు సాహసించితిరా! మీకు వినాశకాలము సమీపించుచుండుట చేతనే యిట్టి పాపకార్యములఁ జేయుచున్నారు. పరమేశ్వరుఁ డైనను మిమ్ముల శిక్షించక విడిచిపెట్టునా?"

ఆ మాటలు విని "ఈయనవసర సంభాషణముతో మాకుఁ బనిలేదు. మేము మదాలస యాజ్ఞ ననుసరించి వర్తించువారమని యెఱుంగుము. ఇప్పుడు నిన్నుఁగూడ మీమామె యొద్దకుఁ దోడ్కొని పోవలయును. రమ్ము" అని పలికి వసంతునితో దేవాంగనను వెంటఁబెట్టుకొని, భటులు వెంట నరుదేర నా వీరపాలుఁడరిగెను.

# ఐదవ ప్రకరణము.

"అక్కటా! విక్రాంతుఁడు కారాగృహముంచుండి యీవలఁ బడుటయెట్లు? ఇందులకేమి యుపాయ మూహింతును? ఆలశ్య మొనర్చినచో నాతని కేమియుపాయ మొదవునో యని గూడ నాకనుమానముగుచున్నది. ఆతఁడీవలఁబడెనేనిఁ గొంత వఱకు నాహృదయముననున్న సంతాపము పోవును. అదియుం గాక మదాలస యొనర్చుచున్న తంత్రములకుఁ బ్రతితంత్రము నాలోచింపఁగలఁడు. కళింగరాజ్యోద్ధారణదీక్షాబద్ధకంకణుఁడై చెఱంజిక్కిన విక్రాంతుని రక్షించుటకై, నాకాతనిపై నున్న మోహ మెట్టిసాహస కార్యమునైన జేయుటకుఁ బ్రేరేచుచున్నది. నేను యోగివేషముధరించి నేటిరేయిని గారాగృహమునకేగి, యచ్చటనుండు రక్షకభటులను వంచించి, విక్రాంతునకుఁ గారాగృహ విముక్తి గూర్పవలయును," అని మృణాళిని మనంబునఁ దలంచెను.

మృణాళిని చేయనెంచిన కార్యము సామాన్యమైనది కాదు. కేవలము స్త్రీయైన యామె కపటసన్యాసివేషమునఁ గారాగృహరక్షకులవంచించి, విక్రాంతుని రక్షింపఁగోరెను. ఇయ్యది నిజముగా నతిసాహసమైనకార్యమే. ఇందేమాత్రము రహస్యము బయలుపడినను నామెప్రాణములు దక్కవు. ఏమయినను నామె యాకార్యమును జేయుటను నిశ్చయించు

కొనెను. మధ్యాహ్నము మూడుఘంటలు మొదలు సూర్యాం
పస్తాద్రికిం జేరువరకును సన్యాసివేషము నలంకరించుకొనుటకు
సరిపోయెను. తన కపటాకృతి బయలుపడునేమో యను సను
మానముచేతం బలుసారులు దర్పణమునందుం జూచుకొని
సంతృప్తిం బొందెను.

రాత్రి పది గంటలయ్యెను. అంతనామృణాళిని సురచేం
బూరింపంబడిన కొన్నికాచపాత్రలుగల సంచి నొకదానిని
జంకందగిలించుకొని, యోగదండమును చేతంబూని మందిరము
విడిచెను. సుక్షత్రియకాంత కలంకారమగు గుప్తఖడ్గమామె
నడుమున ధరించి యుండెను. నగరమంతయు మాటుమడంగి
యుండెను. ఆమె నెమ్మదిగాం జనిచని చెఱసాలను సమీ
పించెను. రక్షకభటులిరువు రాయుధపాణులై కావలింగాచు
చుండిరి. మృణాళిని వారికిం గొంచెము దూరముగా నిలచుండి
"జయసీతారాం" అనిగట్టిగాం బలికెను. ఆమాటవినంగనే
రక్షకభటులు "ఎవరునీవు? ఇచ్చటికెందులకు వచ్చితి" వని
యడిగిరి.

మృణా:—నేనొక సన్యాసిని. ఇది ధర్మశాలకాదా ?

రక్ష-భ:—ఇది సన్యాసులుండు ప్రదేశముకాదు. ఇది చెఱ
సాల. ధర్మశాల నగరంబున నున్నది. పొమ్ము.

మృణా—అబ్బా! నే నిప్పు డెచ్చటికి పోవంగలను? నిశాస మ
యము. కడు దూరమునుండి వచ్చుటచే మిగుల నా యాస

మందితిని. ఎట్లో కొంచెము సేపిచ్చట విశ్రమించి, తెల్ల వారఝామున నావలకుఁ బోయెదను. సన్యాసి నగు నా యందు దయయుంచి యిందుల కంగీకరింపుఁడు.

రక్ష-భ—ఇచ్చట నితరు లెవ్వరును బరుండరాదు. కారా గృహాధికారి చూచినచో మాట వచ్చును.

మృణా—నాయనలారా! మీకు మాట వచ్చునట్లు చేయు వాఁడఁగాను. ఇయ్యది చెఱసాల యని తెలియక వచ్చి తిని. ఎట్లో రెండుఘంటల కాలము నాయందు మీరు దయఁజూపుఁడు.

ఇట్లు చెప్పి మృణాళిని తన చంకనున్న సంచిని క్రిందఁ బెట్టి "జయ సీతారాం" అని కూర్చుండెను. అప్పు డొక రక్షక భటుఁడు రెండవవానింగాంచి "ఏమిది! ఈతఁ డిచ్చటఁ గూర్చున్న వాఁడు. ఏమిసేయుదము? గట్టిగా నవతలకుఁ బొమ్మందమన్న సన్యాసి యగుటచే జాలి యగుచున్నది" యనెను. రెండవ వాఁడు "పోనిమ్ము. ఇందులో మించిపోయిన దేమున్నది? కొంచెముసేపుండి, యీతఁడే యరుగును. కాని యీతఁ డొక గొప్పసాధువువలెనే యున్నాఁడు," అని పలికి, మృణాళినిం గాంచి, "నీవు తెల్లవారుఝాముననే యావలకుఁ బోవలయు" నని చెప్పెను.

రక్షకభటులును, మృణాళినియుఁ గొంచెముసేపు ఏదో సంభాషణఁ జేసిరి. ఆసందర్భమున మృణాళిని వారికి- వారణాసీ

గయా ద్వారకాది పుణ్యక్షేత్రమహిమలను గూర్చి శరీరములం బులకలువొడమునట్లు చెప్పుచు "మిక్కిలి దస్సియున్న నన్ను మీరీయర్ధరాత్రి యిచ్చట విశ్రమింపనిచ్చితిరి. ఈఋణము నేనెట్లు తీర్పఁగలను? సన్యాసినగు నేను మీకేమియు నీయ లేను కదా! కాని, నాయొద్ద నతివిలువగల సురయున్నది. ఇది యెచ్చటను లభ్యపడునదికాదు. నాయందున్న భక్తిచే ద్వారకయందొకఁడు నాకిచ్చినాఁడు. నేనది మీకుఁగొంచ మిచ్చెదను. దానిని మీరుసేవించినచో నాయాత్మ యానంద మందు" నని పలికెను. "మహానుభావుఁడవగు నీవుమాకొసం గుమనని చెప్పుచుండఁగా మేమువలదందుమా" యని భటులనిరి. అంతట మృణాళిని తనసంచియందున్న కాచపాత్రలఁదీసి రక్షక భటులకిచ్చి "ఇది యెక్కువ మత్తుకలుగఁజేయునది కాదు. మిగులయానందముగనుండును" అని వచించెను. కాచపాత్రల యందుండు సుర నాయిరువురు రక్షకభటులును ద్రావిరి. ఏవేవో వెఱ్ఱిమాటలాడి, తుదకు వారు శరీరముల మఱచిపడిరి.

ఇంకను గారాగృహరక్షకభటు లాయామూలల నుండిరి గాని వారందఱును సంపూర్ణనిద్రావస్థ నుండిరి. అదియుంగాక మృణాళిని రక్షకభటులతోఁ గూర్చున్న ప్రదేశమున కెదురుగ నున్నకొట్టునందే విక్రాంతుఁడు బంధింపఁబడి యున్నాఁడు. ఆకొట్టు తలుపుఁదీయుట యెట్లని యామె యాలోచించుచు లేచునప్పటికి, సురాపానముచే నొడలుదెలియక పడియున్న

రొక రక్షకభటుని ప్రక్కనున్న బీగ మామెకాలికిఁ దగిలెను. భగవంతుఁడు తనయెడల నీవిధముగ ననుగ్రహించెనని యామె తలంచి వెంటనే యాబీగమును దీసికొని, యెదుటనున్న కొట్టు దగ్గఱకు బోయెను. అందు విక్రాంతుఁడొక్కఁడే బాధింపఁ బడి యుండెను. అయినను ననుమానము దీర్చుకొనుటకై యామె యాతనింగాంచి "నీవు విక్రాంతుఁడవేనా" యని యడిగెను. "అవును నీవెవ్వరవు? సన్యాసివగు నీవిచ్చటి కేలవచ్చితివి?" యని విక్రాంతుఁడు పలుక నామె "నే నెవ్వరైన నేమి? ముందు నీవీచెఱసాలనుండి యావలఁబడుము" అని తాళముఁ దీసెను. విక్రాంతుఁడు వెంటనే యీవలకువచ్చి వెనుకకుఁ దిరిగి చూడకుండఁ జెఱసాల యావరణమును దాటి యావలకుఁ బోయెను. మృణాళిని మరలఁ జెఱసాలకుఁ దాళమువేసి, బీగము నెప్పటియట్లు రక్షకభటుని ప్రక్క క్రిందఁబెట్టి "నేను వచ్చినపనియైనది. ఈ భటులు నిద్రించు చున్నారు. ఇఁక నేనావలఁబడెద"నని తలంచి, యోగదండమును సంచినిఁ బుచ్చుకొని యాప్రదేశము గమనయమున విడిచెను.

# ఆఱవ ప్రకరణము.

"దేవాంగనా మందిరమునుంచి తీసికొని రాబడి, వీర పాలునిచే ఖండింపఁ బడినవాఁడు- చంద్రశేఖరుఁడు గాఁడు. అతఁడు దేవాంగనా కుమారుఁడే. ఇందుల కావంతయు సందియము లేదు. చంద్రశేఖరు నెచ్చటనో దాచి దేవాంగన యిట్టి మాయఁ జేసియుండును. చంద్రశేఖరుని రహస్యము నాకెట్లు తెలియును?" అని మదాలస యాలోచించుచుండగా నంతకుమున్దే యామెచేత నాజ్ఞాపింపఁబడిన భటులు కారాగృహమునుండి దేవాంగనను దీసికొనివచ్చి, యామెముందుఁ బెట్టిరి.

మదాలస:—దేవాంగనా! నీమందిరమున వీరపాలునిచే బంధింపఁబడిన కుమారుఁడెవ్వఁడు?

దేవాం:—నీవెవ్వనిని బంధించుకొని రమ్మని భటుల నాజ్ఞాపించితివో యాతఁడే యాకుమారుఁడు.

మదా:—చంద్రశేఖరుఁడేనా!

దేవాం:—అవును.

మదా:—కాదని నా కనుమానముగ నున్నదే!

దేవాం:—నీ యనుమానమును బాపుటకు నేనెట్లు సమర్థురాల నగుదును?

ఖండింపఁబడిన యాకుమారుని శిరమును దీసికొని రండని మదాలస భటులకుఁ జెప్పెను. మదాలస యాజ్ఞ ననుసరించి, భటులు ఖండింపఁబడిన వసంతుని శిరముచు దీసికొని వచ్చిరి. ఆశిరంబును జూచిన యంతనే దేవాంగన తనమనంబున "అక్కటా! దుష్టులీ కుమారుని ఖండించినారు. ఏమిసేయుదు" ననుకొని కుమారునుద్దేశించి "హా కుమారా! నీరాజునిమిత్తము ప్రాణములఁ బరిత్యజించితివా! నేను జీవించి యుండఁగనే నీమరణమును నేను కన్నులారఁ జూడవలసి వచ్చినదే! ఇయ్యది నీతండ్రివిన్న యెంత విలపించునోకదా! ఆతఁడు కారాగృహంబునఁ జిక్కియుండుటచే నీకిట్టిగతి సంభవించెనుగాని, లేకున్న వీరపాలాదులు మనమందిరంబును బ్రవేశించి నిన్నుఁదోడ్కొని వచ్చుటకు శక్తులగుదురా! ఇంతికును నేను పూర్వజన్మమునఁ జేసిన పాపమిట్లు పరిణమించినది? సహస్రజన్మములకైన నీవంటి సుగుణ రత్నాకరుండగు కుమారుని నేనుగాంచఁ గలుగుదునా! సంతతి లేదని కుందుచు, ననేకదేవతల కనిశంబును బూజలు సేయుచుండు పుణ్యవతులెందఱో యుండఁగాఁ బాపాత్మురాలనగు నాగర్భంబున నేలజనించితివి? వత్సా! "తేజోనిధికి వయసు కారణంబగునే" యనునట్లు- నీరాజునిమిత్తము వైరుల కరవాలమునకుఁ బ్రాణము లర్పించి, దివినలంకరించిన నీవు కృతార్థుఁడవే. కాని, నీ యసమాన సుగుణములును, మృదు

మధురభాషణంబులును, వినయమును, ధైర్యమును నాకు మఱపునకురావు" అని పెక్కు భంగుల విలపించుచు, దన దుఃఖమును బ్రకటింపరాదని తలంచి, ధైర్యచిత్తయై నిలిచి యుండెను.

మదాలస దేవాంగనకు ఖండింపఁబడిన శిరముఁ జూపుచు "ఇప్పుడు చెప్పుము. ఈశిరం బెవ్వరిది? ఇయ్యది చంద్రశేఖరునిదే యందువా" యనియడిగెను. దేవాంగన ప్రత్యుత్తర మీయలేదు. మదాలస మరలనిట్లు పలికెను. "దేవాంగనా! నీవు దాచినందువలనఁ బ్రయోజనములేదు. ఇదిగో! నీకుమారుఁడు వధింపఁబడినాఁడు. ఇప్పుడైనను నీవు చంద్రశేఖరుని నెచ్చట దాచితివో చెప్పుము. నిన్ను విడిచిపుచ్చెద" ననెను.

దేవాం:—ఇఁకనాకు నీవలన భయమేల? చంద్రశేఖరునిఁగూర్చి నాకేమియుఁ దెలియదు.

మదా:—నీకేమియుఁ దెలియదా?

దేవాం:—ముమ్మాటికిని దెలియదు.

మదా:— ఇప్పుడు నీకుమారుఁడు ఖండింపఁబడినాఁడు కదా! నీవా చంద్రశేఖరుని వృత్తాంత మెఱింగింపక యుంటివేని, నీయెదుటనే నీనాథుఁడగు విక్రాంతుని శిరముగూడ ఖండించి వేసెదను.

దేవాం:— క్షుద్రశీలవగు నీ వెట్టికార్యమునైనఁ జేయఁగలవు. ఇట్టి దుష్కృత్యములఁ జేయుదువని నీవు నన్ను

భయపెట్ట నవసరము లేదు. నేను భయమందుదానను గాను.
నీయిచ్ఛవచ్చినయట్లు మమ్ము జేయుము.

"విక్రాంతుని" గారాగృహమునుండి యిచ్చోటికిఁ దీసి కొనురండని మదాలస భటులకుఁ దెలిపెను. భటులాక్షణము ననే కారాగృహమున కేగి వచ్చి విక్రాంతుఁడెట్లో కారా గారమునుండి తప్పించుకొని పోయెనని మదాలసకుఁ దెలిపిరి. ఆమాట వినినతోడనే దేవాంగన తనయంతరంగమున "గీతులో మేలనునట్లు- నానాథుఁడు చెఱనుండి తప్పించుకొనిపోయెనని వింటిని. ఈమాట నాకెంతయు సంతసముఁ గూర్చుచున్నది. ఇఁక నేనేమయినను నాకు విచారములేదు. కళింగరాజ కుమార సంరక్షణమునకుఁ గావలసిన ప్రయత్నములన్నియుఁ జేయును. సద్గుణవతియు, నిష్కల్మష స్వాంతయు, సాహసు రాలును నగు మృణాళిని యాతనికిఁ దోడై యుండుఁగాక!" యనితలంచెను.

మదాలస యాజ్ఞపై భటులు దేవాంగనను చెఱసాలకు మరల దీసికొనిపోయిరి. మదాలస వీరపాలునిఁ జూచి "వీర పాలా! ఈచిత్రమేమి? విక్రాంతుఁడు కారాగృహమునుండి యెట్లు తప్పించుకొనిపోయెను? అతిజాగరూకతతో మెలంగ వలసినదని నాయాజ్ఞగా నీవు కారగృహ రక్షకులకుఁ దెలిపి యుండలేదా? వారిట్లజాగ్రత్తగ నుండుటకు గారణమేమి! ఇట్టికార్యములు జరుగుచున్నచో మన ప్రయత్నములేమి ఫలిం

-చును? కళింగరాజ్యపీఠము నేనెట్లారోహింతును? మనయభీ ష్టము లెట్లుతీరును?" అనిపలికెను. వీరపాలుఁడు "మదాలసా! విక్రాంతుఁడు చెఱనుండి తప్పించుకొనిపోవుట నాకును వింత గనేయున్నది. ఇఁకముందు మిగుల జాగరూకతతో మెలంగ వలసినదని కారాగృహరక్షకులకుఁ గఠినముగా నాజ్ఞాపించె దను. జరిగిన దానికై మనము చింతించినందువలనఁ బ్రయో జనము లేదుకదా!" యనెను.

"ఇఁకముందు జాగ్రత్తఁ బుచ్చుకొన్న నేమి! పుచ్చు కొనకున్న నేమి? చేతికిఁ జిక్కిన పిట్ట యెగిరిపోయినది. చెఱ నుండి తప్పించుకొని పోయిన యావిక్రాంతుఁ డేమికుట్రల నెవ్వరితోఁ బన్నునో, మనకేమి మోసము వాటిల్లునో నా కేమియుఁ దోచకయున్నది. ఇఁక నాతఁడు మనకుఁ జిక్కఁడు. దుర్జయుఁడు మనకు వశమైయున్నను నొక్కొక్కసమయమున నాతనిని నమ్మకయుందును. నీపైనాకున్న మోహముచేత దుర్భరమైన కార్యములను నీమీదనే పెట్టుచు, రహస్యము లన్నియు నీకే చెప్పుచుంటిని. నాచిత్తమును నీవు గ్రహించి తివో లేదో! నీచేత ఖండింపబడినవాఁడు చంద్రశేఖరుఁడు గా డనుటకు సందియము లేదుకదా? ఎట్లయినను మనమా చంద్ర శేఖరుని జాడలెఱింగి, వానిని గడతేర్పఁ గలిగితిమా, యీ సామ్రాజ్యము నావశమైనట్లే. అప్పుడు మన మిరువురమును నెట్లుందుమో ఆసంగతి యిప్పుడు చెప్పనేల?" యని మదా

లస దుర్జయునిపైఁ జూపించిన కపటమోహమే వీరపాలుని యందుఁ జూపుచుఁ బలికెను.

ఆమాటలకు వీరపాలుని యొడలు పరవశమై పోయెను. అతఁడామె నవలోకించి "విక్రాంతుఁడు చిక్కకయుండునా? చిక్కక పోయినను నాతఁడు మన కేమియు నపాయముఁ గూర్పఁ జాలఁడు. నెమ్మదిగాఁ జంద్రశేఖరుని జాడలు దీయుదము. నీయందున్న మోహముచే మహాపాప కార్యములు గూడఁ జేయుచుంటిని. తుద కేమగునో" యనెను. "ఏమగును? కళింగ సామ్రాజ్య పాలనావైభవంబునఁ దులఁదూగఁ గలవు?" అని మదాలస పలికెను. ఆమాటలకు నవ్వుచుఁ గారాగృహ రక్షకభటులకుఁ దగుజాగరూకతఁ దెలిపి వచ్చెదనని వీర పాలుఁ డరిగెను.

---

# ఏడవ ప్రకరణము.

చెఱనుండి తప్పించుకొనిన విక్రాంతుఁడు తనమందిరమున కేగెను. అచ్చట దేవాంగనయు వసంతుఁడును లేరు. ఏమైయుందురా యని యాతఁడాలోచించుచుండెను. అంతలో నచ్చోటికి మృణాళిని వచ్చి, వసంతుఁడు ఖండింపఁబడెననియు దేవాంగనను బాధించుకొని పోయిరనియు దెలిపెను. సహజ ధైర్యచిత్తుఁడైనను కొడుకుమరణంబును విని విక్రాంతుఁడు

"హా కుమారా! నాకడుపున మంటఁబెట్టి పోయితివా! విద్యలఁ గఱవలేదు. శత్రువులఁదునిమి యశమందలేదు. అక్కటా! ఆమృత్యుదేవత నిన్నింతలోనే మ్రింగివేసినదా!" యని పలు విధములఁ జింతింపఁగడంగెను. అప్పుడు మృణాళిని యాతనిం గాంచి "ధీరపురుషుండవగు నీవిట్లు దుఃఖింపవచ్చునా? బాలుఁడైనను రాజ్యసంరక్షణార్థము తన ప్రాణములఁ గోలుపోయి దివంబలంకరించిన కుమారునికై వగచుట పాడిగాదు" అని చెప్పెను.

రాజకుమారుఁడగు చంద్రశేఖరుఁడు సరోజనిచేఁ గూర్మదుర్గమునకు దీసికొని పోవఁబడెనని వినినయంతనే విక్రాంతుని చిత్తమున నారాటము జనించెను. "మృణాళినీ! నేనిచ్చట నొకనిముషమైనను నిలువఁజాలను. కూర్మదుర్గమునకుఁ బోయి సరోజని యొద్దనుండి చంద్రశేఖరునిఁ దీసికొని రావలయును. ముందాకార్యముఁ జేసినఁగాని దేవాంగనను జెఱనుండి తప్పించు మార్గము నూహింపఁజాలను. మనకు విశ్వాసపాత్రుఁడైన కందనుని మూలమున మదాలసా మాయల నెఱుంగుచు వీలగునంతవఱకు రహస్యముగాఁ గర్తవ్యమూహించుచుండు"మని మృణాళినికి దెలిపి విక్రాంతుఁడు కళింగ నగరమును విడిచెను.

కళింగరాజ్య సంరక్షణంబునకై దీక్షవహించి మిగుల శ్రమనందుచున్న యాతని చిత్తమునకుఁ గుమారమరణంబు న-

దేవాంగనా కారాగార బంధనంబును జింత గలుగఁజేయు
చున్నవిగాని, యాతఁడాచింతనైన సరకుఁగొనక, చంద్రశేఖర
ప్రాణసంరక్షణమే ముందుఁ జేయవలసిన ముఖ్యకార్యమని
యరణ్యమార్గమున వడిగ నడచుచుండెను. ఆతఁడు కూర్మ
దుర్గమును జేరులోపలఁ దనజాడ మదాలస కేమయిన దెలిసి
నచో మార్గమధ్యమందుఁ దాను రిపులకుఁ బట్టువడుదు
నేమోయని కూడ గొంచెము సంశయించుచునే యుండెను.
రాజకుమారుఁడగు చంద్రశేఖరుఁడు సరోజనియొద్ద నుండుటచే
నాతని కేమిహాని యొదవునో యని చింతించుచుండెను.
గతించిన కుమారునిఁ గూర్చి దుఃఖించి నందువలనఁ బ్రయో
జనములేదు. ఏవిధముగానైన రాజకుమారుని సరోజని యొద్ద
నుండి తీసికొనివచ్చిన పిదప దేవాంగనను జెఱనుండి తప్పింప
వలసిన కార్యమే యాతని మనస్సును శోధించుచుండెను.
కార్యాతురతను బ్రయాణముఁజేయు మానవుఁడు గట్టులను,
బుట్టలను, ముండ్లను లక్ష్యముసేయక నడచుచుండును. మన
మెంతవడిగా నడచినను బ్రొద్దుతో సమానముగ నడువలేము
కదా! మనకై సూర్యుం డపరాద్రినిఁ జేరకుండ నుండడుకదా!
కూర్మదుర్గమిక నాలుగుకోసుల దూరముండెను. విక్రాంతుఁడు
మిగుల డస్సియుండుటయేగాక సూర్యుం డపరాద్రికిఁ జేరు
చుండెను. కనుచూపు మేరలో నాతఁడొక పల్లెంగాంచి యా
రాత్రికచ్చట విశ్రమించి తెల్లవారఝామున బయలుదేరి
కూర్మదుర్గమునకుఁ బోవఁదలంచి యాపల్లెకుఁ జేరెను.

---

# ఎనిమిదవ ప్రకరణము.

సీ॥ "ఉరుమహోదయ ధరే ♦ శ్వరుఁడు దాల్చిన పద్మ
రాగ ఖచితపుఁ దు ♦ రాయియనఁగ
బలభిత్సభామంట ♦ పమునందుఁబట్టిన
బెడగారు కెంబట్టు ♦ గొడుగనంగఁ
బ్రత్యూషమున విష్ణు ♦ పదమునకెత్తిన
దివ్యనీరాజన ♦ దీపమనఁగఁ
దొలిదిక్కుజవరాలి ♦ యళికస్థలంబునఁ
దులకించు కాశ్మీర ♦ తిలకమనఁగ

తే. స్వతరుణారుణకాంతు లూ ♦ ర్ధ్వమునకెగసి
శరధపదమండలంబు చెం ♦ దిరముపాఁమి
నట్లు గావింపనొయ్య నొ ♦ య్యనఁబయోజ
మిత్రబింబంబు పూర్వాద్రి ♦ మీదఁదోఁచె."

అట్టిసమయమునఁ గూర్మదుర్గమున సరోజని "కళింగ నగరమునుండి వార్త లేమియుఁ దెలియుటలేదు. దేవాంగన యేమైనదో! మృణాళిని యెట్లున్నదో! మదాలస దేవాంగనా పికాంతుల యెడల నేమికీడుసేయఁ దలంచుచున్నదో! స్వామిద్రోహియై మదాలస మాయలోఁబడిన నా నాథుఁ డిచ్చటికి రాకయుండుటయు మిగుల వింతగనేయున్నది. అతఁడు

సర్వకాల సర్వావస్థల యందును మదాలసను సేవించు
చున్నాఁడని కర్ణాకర్ణిగా వింటిని. పోనిమ్ము. అతఁడచ్చటనే
యుండుఁగాక! అతఁడొకవేళ వచ్చినను దుర్గములోఁ బ్రవేశింప
నీయవలదని దుర్గసంరక్షకులకు నాజ్ఞనిచ్చియుంటిని. ఏది
యెట్లయినను రాజకుమారుఁడగు చంద్రశేఖరుని నేనతిజాగ
రూకతతోఁ గాపాడి, యాతఁడు కళింగరాజ్యపీఠమున నాసీ
నుఁడై యుండఁ జూచి యానందింపవలయును. అట్లొనర్చితినేని
దేవాంగనా మనోరథమును సిద్ధింపజేసినదాన నగుదు" నని
తలంచుచుండెను.

మృణాళినికడనుండి చంద్రశేఖరునిఁ దోడ్కొనివచ్చిన
నాటినుండియు సరోజని యక్కుమారుని నతిజాగరూకతతోఁ
గాపాడుచుండెను. అతని కెట్టి విధమైన కొఱంతయుఁ గలుగ
కుండ శతవిధముల నరయుచుండెను. దేవాంగనా విక్రాంతు
లై యాతఁడు బెంగఁగొనకుండ, నేసమయంబున కేది కావలసిన
నదియిచ్చుచుఁ గడుప్రేమతోఁ జూచుచుండెను. అతఁడును నామె
యందు నతిభక్తిఁ బూనిచరించుచుండెను. కాని యప్పుడప్పుడాతఁడు
దేవాంగనావిక్రాంతులను గూర్చి తలంచుచునే యుండెను.
కళింగనగరమునుండి తన్ను సరోజని యేకారణముమీఁదఁ
గూర్మదుర్గమునకుఁ దీసికొనివచ్చినదో తెలియదు. దేవాంగనా
విక్రాంతులు కూర్మదుర్గమున కెప్పుడు వచ్చెదరని మాత్ర
మాతఁడు సరోజని నడుగుచుండును.

సరోజని తనమనంబున నేదియో యాలోచించుచున్న సమయంబునఁ జంద్రశేఖరుఁడు వచ్చి "మాపినతండ్రి యగు విక్రాంతుఁడును, బినతల్లియగు దేవాంగనయు నిచ్చటికి వచ్చెదరని యనుదినంబును బలుకుచుందువే! ఇంతవరకు రారేమి" యని యడిగెను.

సరోజని:—కుమారా! వారు తప్పక వచ్చెదరు. నీవు వారిం గూర్చి బెంగఁగొని యుంటివా?

చంద్ర:—బెంగ యేమియును లేదు. కాని, నేను మారాజ్యమును విడిచి యిచ్చటనుండుటకుఁ గారణము నూహింపఁ జాలక యున్నాను. ఆకారణము నీవెఱింగించితివేని సంతసింతును.

సరో:—నాయనా! దుష్టచిత్తయైన నీమేనత్తయగు మదాలస వలన భయంబునఁ జేసి నీవిచ్చట నుండవలసి వచ్చినది. రాజ్యకాంక్ష వహించిన యామె నీకు హానిఁగూర్పఁదలఁచినది. నీనిమిత్తము దేవాంగనావిక్రాంతులు సకల కష్టములఁ బొందుచున్నారు.

చంద్ర:—బాలుఁడనగు నేనామదాలస కేమియపకారముఁ జేసితిని.

సరో:—వత్సా! జ్ఞానశూన్యులు యుక్తాయుక్తములు యోచింపరుగదా!

ఇట్లు వీరిరువురు సంభాషించుచుండఁగా ద్వారపాలుఁ డొక చీటిందెచ్చి సరోజనింగాంచి "దేవీ! నిన్ను దర్శించుట కెవ్వఁడో వచ్చి యీచీటి నీకొసంగుమని వచించి, ద్వారమున నిలిచియున్నాఁడు" అనిచెప్పెను. సరోజని యాచీటింజూచి "ఆపురుషుని లోనికిఁబంపు" మని ద్వారపాలునితోఁ జెప్పి, "నాయనా! నీపినతండ్రి వచ్చినాఁ"డని చంద్రశేఖరున కెఱిం గించెను.

విక్రాంతుఁడు వచ్చినయంతనే చంద్రశేఖరుఁడు-పెన్నిధిఁగన్న పేదచందంబున సంతోషించుచు నాతనిం గౌఁగలించుకొని "పిన్నతల్లియగు దేవాంగనయు, సోదరుఁడగు వసంతుఁడును రాలేదేమి కారణ"మని యడిగెను. ఆమాటకుఁ బ్రత్యుత్తర మీయఁజాలక విక్రాంతుఁడు కొంచెముసేపు మౌనము వహించియుండెను. ఆతనిమౌనమున కనుమానమంది సరోజని "విక్రాంతా! పుత్రసహితయగు దేవాంగనకుఁ గుశలమేకదా! మృణాళినికిక్షేమమే?" యని యడిగెను. గద్గదకంఠుఁడై విక్రాంతుఁడు "సరోజనీ, ఏమిచెప్పుదును? నాకుమారుఁడగు వసంతుఁడు ఖండింపఁబడినాఁడు. దేవాంగన కారాగృహంబున బంధింపఁబడినది నేనొక యోగి యనుగ్రహంబునఁ జెఱసాల నుండి యీవలఁ బడినాఁడ. ఆసన్యాసి యెవ్వఁడో, నాకాతనిపైఁ గరుణకలుగుట కేమి కారణమో నాకుఁదెలియదు. ఈవిషయమును గూర్చి మృణా

ళిని నడుగఁదలచియుఁ జింతాపీడితుఁడనగుటచే మఱచితిని. ఆ మదాలస యెన్నికూ్రరకృత్యములనైనఁ జేయసాహసించు చున్నది. చెఱయందు బంధింపఁబడిన దేవాంగనకేమి హాని గూర్చునోయని సంశయమగుచున్నది" యనిపలికెను. వసంతుని మరణమువిని సరోజని మిగుల దుఃఖించెను. చంద్రశేఖరుఁడు విలపించెను. సరోజనిచే నూరడింపఁబడి చంద్రశేఖరుఁడు తన విచారమును క్రోధముగా మార్చుకొని పినతండ్రియగు విక్రాంతుని వీక్షించి యిట్లుపలికెను. "తండ్రీ! మీరు నాకై యనేకకష్టంబులఁ బొందుచుంటిరి. ఇన్నికష్టంబులఁబడనేల? నన్నా కళింగ నగరమునకుఁ దీసికొనిపొమ్ము. ఆమదాలస శిరంబు నొక్కవ్రేటున నఱికి నీకు ముదంబుఁగూర్చెదను. కర వాలముఁ గరమునందు ధరించినందువలనఁ బ్రయోజనమేమి యున్నది? దేశాపకారులను, నధర్మవర్తనులను, దుష్టచరిత్రు లను ఖండించుటకుఁగదా యియ్యది ధరింపవలయును? మదీయ హస్తాలంకృత కృపాణధారలచే మదాలసను, దదనుచరులను గంఠనాళముల నఱికి తదీయరక్తము భూమిపై నదులు గట్టిం చెదను. అంతవఱకును నేను నిద్రపోవను. లెమ్ము. నారాజ్య పీఠము నెక్కుటకు మదాలస యెట్లర్హురాలగునో చూచెదను."

బాలుని వీరవాక్యములకు విక్రాంతుఁడానందమంది, ముద్దాడి "తండ్రీ! విరోధులను వధించుటకు బాలుఁడవైన నీవు కావలయునా! నేను రణంబున నిలచితినేని నన్ను

మార్కొనఁగల వాఁడెవ్వఁడు? కుమారా! పరాక్రమ శౌర్యం
బులు గలిగి యుండియుఁ గాలమునకుఁ గట్టుబడి నీనిమిత్త
మిట్టిశ్రమల నందుచున్నాఁడను. నీతండ్రితో నేనును దేవాంగ
నయుఁ జేసిన శపథము ననుసరించి, నిన్నుఁ గళింగరాజ్య
భద్ర పీఠంబున నాసీనుం జేసి తీరుదును. ఇందులకై నేనుగాని
దేవాంగన గాని ప్రాణములనైన విడుచుటకు సంసిద్ధులమై
యుంటిమి."

"విక్రాంతా! నీవు కారాగృహమునుండి యీవలఁ
బడితివికదా! దేవాంగన నెట్లయినఁ జెఱనుండి తప్పించుటకుఁ
బ్రయత్నింపక, యిట్టిసమయములో నిచ్చటికేల వచ్చితివి?"
యని సరోజని విక్రాంతుని నడిగెను. అందులకు విక్రాంతుఁడు
"సరోజనీ! నాచిత్తమంతయు నీచంద్రశేఖరుని మీఁదనే
యున్నది. ఈతనిపైనున్న బెంగ నాకునిజకుమారుమరణాంబును,
దేవాంగనా కారాగృహ బాధనంబును మఱపించినవి. నీవు
మా యెడలఁ గరుణవహించి యీకుమారుని నింతవఱకును
గాపాడినందుల కెంతయుఁ గృతజ్ఞుఁడను. ఇఁక నీతనిని దోడ్కొని
పోవుదును. ఇందులకు సమ్మతింపుము. నేనిచ్చటికి వచ్చుట
కిదియే కారణ"మని విక్రాంతుఁడు బదులు జెప్పెను.

సరోజ:—నీవీకుమారునిఁ దోడ్కొని పోవుటకుఁ దగిన
కారణము నేనెఱుంగఁజాలక యున్నాను. ఈతనికిచ్చట
గొఱత యేమయినఁ గలుగునని తలంచితివా ?

విశాం:—నీయొద్ద వీని కేమియు లోపముండదు.

సరో:—అట్లయినఁ గారణమేమి? ఈతఁడు నాయొద్ద నుండుట వలన నేమైన హాని యొదవునేమో యని భావించితివా?

ఈమాటకుఁ బ్రత్యుత్తరమేమని చెప్పవలయునో విశాంతునకుఁ దోచలేదు. "నీ దగ్గఱనున్నచో నీకుమారునకు హానియొదవునని చెప్పినచో నామె చిత్తమున నేమని భావించునో! చెప్పకయున్నచో నాతని భావ మామె కెట్లు తెలియును?" ఈసందేహములచే నాతఁడు కొంచెముసేపాలోచించి, తన సంశయమును బ్రకటింపఁదలంచి సరోజని కిట్లు పలికెను.

"సరోజనీ! నీవు నాకు సోదరివంటి దానవగుటచే నా నిష్కల్మష హృదయభావమును నీకు వెలిఁబుచ్చుచున్నాను. నాయందేమయిన దోషమున్నచో మన్నింపుము. కళింగరాజ్యోద్ధారణముఁ జేయ దీక్షవహించిన నాకన్నియు సంకటములే ప్రాప్తించుచున్నవి. ఒకప్రక్క నిజకుమార మరణమువ గలిగిన చింత. వేఱొకప్రక్క దేవాంగన చెఱఁబడుటవలనఁ గలిగిన చింత. వీని కేమి ? రాజకుమార సంరక్షణమును గూర్చిన చింతయే ముఖ్యముగ నాహృదయమును బాధించుచున్నది. నీవు నిష్కల్మష చరిత్రవనుటకుఁ గాని, నీయొద్ద నున్నంతవఱకుఁ జంద్రశేఖరుఁడు సురక్షితుఁడై యుండు ననుటకుఁగాని యణుమాత్రము సంశయములేదు. కాని, యొక్క విషయము మాత్రము నీకుఁ జెప్పక తప్పదయ్యెను. నిన్ను

మొన్నటి దాక విక్రమాదిత్యుని యందు భక్తి విశ్వాసము లతోఁ మెలంగిన సేనాధుఁడగు దుర్జయుఁడు నేఁడు మదాలసకు విధేయుఁడై, దుష్టకృత్యములయందామెకుఁ దోడ్పడుచున్నాఁడు. వీరపాలుఁడును, దుర్జయుఁడును నామెకుఁ గుడియెడమ భుజములై వర్తించుచున్నారు. మదాలసామాయావాగురం జిక్కియున్న దుర్జయుఁడీ చంద్రశేఖరు జాడ నెఱింగి యిద్యెడ కరుదెంచి యేమిహాని సేయునో యని నేనుసంశయించుచున్నాను. అతఁడరుదెంచి యికుమారుని మదాలస కడకుఁ దోడ్కొనిపోవుటకుఁ దనవశముఁ జేయుమని యడిగినచో నీవేమని చెప్పఁగలవు ? వశముఁ జేయనని ధిక్కరించి పలుకఁ గలవా ? దుష్టులను గొందఱిని వెంటఁబెట్టుకొనివచ్చి బలాత్కారముగఁ దీసికొనిపోయినచో నేమిచేయఁగలవు ? ఈకుమారుని ప్రాణసంరక్షణము నిమిత్తము నీవు దుర్జయునితోఁ గలహముఁ బెట్టుకొందువా ? వీని మూలమున నీవిట్టి కష్టములంద నేల ? కావున నే నీతనినిఁ దీసికొనిపోయి యెచ్చటనైన రహస్యస్థలంబున భద్రముగా నుంచి, యనంతర విధానమును గూర్చి ప్రయత్నములు జేయుదును."

సరోజని విక్రాంతుని వాక్యములువిని యిట్లుప్రత్యుత్తరముఁజెప్పెను. "విక్రాంతా! ఈసంశయము నిన్నుబాధించునని నాకుఁదెలియును. నీవు దానిని వెల్లడించినందులకు నేనెంత

యు సంతసించితిని. కళింగరాజ్యోద్ధారణమును గూర్చి నీవును దేవాంగనయు నెట్లు దీక్షాకంకణులైతిరో, యట్లే నేనును జంద్రశేఖరుని ప్రాణసంరక్షణమునకు దీక్షవహించితిని. ఇవ్విషయమై నేను మృణాళినితో శపథముఁ జేసియుంటిని. నాశపథమున కేమాత్రము భంగమొదవదు. ఈతని సంరక్షణమునకై నీవుపడుచున్న శ్రమలో నన్నుఁగూడ గొంతపాలుఁ గొననిమ్ము. ఒకవేళ మదాలసా ప్రేరేపణంబున నానాథునివలనఁ జంద్రశేఖరునకు హానికలుగునేమో యని నీవుసంశయింపఁబనిలేదు. ఏనాడాతఁడు విక్రమాదిత్యుని యందుండు భక్తివిశ్వాసములు మఱచి, దుష్టచిత్తయగు మదాలసకు వశుఁడయ్యెనో, యానాడే నాకు భర్తకాడని తలంచితిని. ఆనాడే నాకును నాతనికిని ఋణము తీరిపోయినది. ఆతఁడియ్యెడ కరుదెంచినను దుర్గమును బ్రవేశింపనీయవలదని దుర్గరక్షకులకుఁ జెప్పియుంటిని. నాకంఠమునఁ బ్రాణములున్నంతవఱకుఁ జంద్రశేఖరున కేమియు భయముండదు. ఇవ్విషయంబున నీవు సంశయింపఁ బనిలేదు. ఇక్కుమారుఁడు నాయొద్దనే యుండును. నన్ను వీరక్షత్రియకుల ప్రావిఖ్యాతగను, సత్యవాక్యదీక్షామతిగను నెఱుంగుము. చంద్రశేఖరుని విషయమున నేనేమైనఁ బాపము దలంచి నాకడ నుండనిమ్మని పలికినదాననేని కాంతావ్యామోహమును విడువలేని యోగీశ్వరుఁడు పోవుగతికిని, మధ్యస్థుఁడనని పలికి తగవుదీర్చుచోటఁ బక్షపాతము వహించెడివాని

గతికిని, వివాహకార్యములు భంగముసేయువాని గతికిని, బరాంగనా మానసోల్లాసుని గతికిని, మాతాపితృ భక్తివిహీనుని గతికిని, నపరాహ్ణవేళ నాకలిఁగొని వచ్చిన యతిథికి నన్నముఁ బెట్టకుండ భుజించిన వానిగతికిని, నర్థాపేక్షను బుత్రికను వృద్ధున కొసంగి వివాహముఁజేసిన వాని గతికిని, నపరాధము లేకుండ భార్యను బరిత్యజించిన వానిగతికినిఁ బోవుదును.

"క. శతకూపాధిక దీర్ఘిక
శతవాప్యధికంబు గ్రతువు ♦ శతయజ్ఞసము
న్నతుఁడొక్క సుతుఁడుఁ దత్సుత
శతకంబున కెక్కుఁడొక్క ♦ సత్యోక్తినృపా."

ఈవాక్యార్థమును నేనుసంపూర్తిగ గ్రహించిన దానను కావున నన్నునమ్మి చంద్రశేఖరు నిచ్చుటసేయుదుము."

సరోజని మాటలు విని విక్రాంతుఁడు తనమనంబున "ఈసరోజని నిశ్చయముగా నిష్కల్మషచరిత్ర యగుటచేతనే మృణాళిని చంద్రశేఖరుని నీమెకడ కంపినది. ఈమె చెప్పిన మాటలయందు లేశమంతయును నసత్యములేదు. ఈమె యొద్ద నున్నచోఁ జంద్రశేఖరున కేమియు భయంబొదవదు." అని తలంచెను. చంద్రశేఖరుఁడు విక్రాంతునిఁజూచి "పినతండ్రీ! నేను సరోజనియొద్ద సుఖముగా నుందును. నీవు నన్నుఁగూర్చి భయమొందఁబనిలేదు. ఎట్లయినను మదాలస నంతొంబొందించుటకు నీవు చేయవలసిన ప్రయత్నములన్నియుఁ ద్వరలోఁ

జేయుము" అని వచించెను. "సరోజనీ! నిష్కపట స్వాంతవగు నీమాట కెదురు చెప్పఁజాలను. నీవు కోరినయట్లు చంద్రశేఖరుఁడు భవద్రక్షణంబువనే తనరఁగలఁడు. ఈతని విషయమై నీకు నేను చెప్పవలసిన దేమియు లేదు. ఈతని భారమంతయు నీయది," యని విక్రాంతుఁడు సరోజనితోఁ జెప్పెను. "ఇంకను మాట్లాడవలసిన సంగతు లేమయిన నున్న భోజనానంతరమున సావకాశముగ మాట్లాడుకొనవచ్చు"నని సరోజని పలికినంతనే విక్రాంతుఁడు స్నానాదికృత్యములు దీర్చుకొనుటకు లేచెను.

---

# తొమ్మిదవ ప్రకరణము.

కళింగనగరమున- మదాలస మందిరములోఁ గూర్చుండి కారాగృహము నుండి దేవాంగనను దీసికొని రమ్మని భటుల కాజ్ఞాపించెను. మదాలస యాజ్ఞననుసరించి దేవాంగనను భటులు దీసికొనివచ్చిరి. మదాలస దేవాంగననుజూచి "దేవాంగనా ! నీవుచేసిన మాయ యంతయు నేనుగ్రహించితిని. నీవు దాచినందువలనఁ బ్రయోజనము లేదు. వీరపాలుని కృపాణమునకుఁ జంద్రశేఖరునకు మారుగా నీవు నీకుమారుని బలిఁ బెట్టితివి. కన్నకొడుకును జంపుకొనుటకు నీచిత్తమెట్లు సమ్మతించినది ? సరే! జరిగిన దానికేమి? ఇప్పుడైనను నీవు సాక్షు

మందదలంచిన దానవేని జంద్రశేఖరు నెచ్చటదాచితివో చెప్పుము. నిన్నుఁ గారాగృహమునుండి విడిచివేసెదను. నీవా రహస్యము నిప్పుడుజెప్ప వేని నీకు మరణము నిశ్చయమని యెఱుంగుము,”అని పలికెను. ఆపలుకులకు దేవాంగనయుంచు కంతయుఁ జలింపలేదు. ఆమె ధైర్యచిత్తయై మదాలసకిట్లనెను.

“మదాలసా! నీవెంతయడిగినను రాజకుమారుని విష యము నాకేమియుఁ దెలియదు. వీరపాలునిచేత ఖండింపఁ బడినవాఁడు నాకుమారుఁడే. కన్నకొడుకును జంపుకొన్న పాపాత్మురాలని నన్ను దూషించుచుంటివి. నీకన్నఁ బాపచిత్త లీప్రపంచమున లేరు. రాజ్యకాంక్షం జేసి జనకసమానుడును సచ్చరిత్రుఁడును నగు సోదరునిఁజంపి, భర్తను స్వర్గమునకుఁబంపి యిప్పుడు సోదరపుత్రునిఁగూడఁ జంపఁ జూచుచున్నావు. నీవెన్ని దుష్టకృత్యములఁ జేసినను గళింగరాజ్యపీఠము నీవా రోహింపఁజాలవు. ఇదినిశ్చయము. నీవు నన్నుఁ జంపుదువని నేనావంతయు భయపడను. ఏనాఁడు నీవు నన్నుబంధించితివో యానాఁడే నాప్రాణములు పోయినవిగ భావించితిని. రాజ్య సంరక్షణార్థము నేనుగాని నాజీవితేశ్వరుఁడుగాని ప్రాణముల నయిన విడుచుటకు సంసిద్ధులమని యెఱుంగుము. మృత్యువనిన నీకు భయముగాని నావంటి వీరవనితలకు భయంబుండదు. ఈ దేహ మెప్పుడైనను మరణమున్నది. అట్టియెడల నేఁడైననేమి? రేపైననేమి?”

దేవాంగన పలికిన వాక్యము లాలించి మదాలస యూమెంగాంచి "చంపెదమన్నను భయమందక సంధిజ్వర పీడితునివలెఁ బ్రేలుచుంటివేమి? నీవు చంద్రశేఖరుని జాడ నెఱింగించెదవా లేదా" యనెను. "చావనున్న దానికి నీవలన భయంబేల ? చంద్రశేఖరునిజాడ నాకుఁదెలియదు. నన్నీవిష యమును గూర్చి నీవడుగఁ బనిలేదు. నీవు నన్నుఁ జంపినను సరే," యని దేవాంగన బదులుచెప్పెను. అంతట మదాలస భటులంజూచి "ఈసాహసురాలి గ్రుడ్లను బెఱికివేయుఁ" డని యాజ్ఞాపించెను. ఆహా! అతిదారుణము! అతిదుస్సహము! భటులు మదాలస యాజ్ఞననుసరించి దేవాంగన గ్రుడ్లు పెఱికి వేసిరి.

"హా! పరమేశ్వరా! దీనత్రాణపరాయణుఁడను నీబిరుద మేమూలనడంగియున్నది ? నిరంతరము నిన్ను సేవించు నకల్మష చరిత్రనగు నాకీపాటు రాఁదగినదేనా ? నీవునాయెడల నిర్దయ వహించుటకు నేనొనర్చిన పాపమేమియున్నది ? దుష్టచరిత్ర యగు మదాలస యొనర్చుకృత్యములు నీకు సంతోష మయ్యెనా?" యనిదైవము నుద్దేశించి పలికి, యాదేవాంగన మదాలస కిట్లనెను. "క్రూరాత్మురాలా! మదాలసా ! నీవిట్టి దుష్కార్యములచేత నిప్పుడు సంతోషించినను, నీవు బ్రదికి యుండఁగనే యీపాపములకుఁ దగినఫలమును బొందకపోవు. స్వామిద్రోహులై, నీమాయయందుఁ జిక్కి నీకుఁ జేయూత

నిచ్చుచున్న వీరపాలుఁడును, దుర్జయుఁడుగూడ దుర్మరణాంబు నందుదురుగాక! కళింగరాజ్యపీఠమునఁ జంద్రశేఖరుఁడాసీనుఁడై యాచంద్రతారకముగఁ బాలించుఁగాక!"

మదాలస భటులంజూచి, ఈదేవాంగనను నగరమునకు వెలుపలనున్న యరణ్యమున విడిచిరండు." అని యాజ్ఞనిచ్చెను. భటులు దేవాంగనను గొనిపోయిరి.

భటులు దేవాంగనను నరణ్యమున విడిచిపోయిరి. ఆమె యేకాకియై యుండెను. ఎచ్చటికిఁ బోవుటకును గన్నులు గనిపించుటలేదు. ఎవ్వరిని వేడుకొనును? ఎవ్వరామెను రక్షింతురు? "మదాలసా! కఠినచిత్తవై యెట్టిదుష్కార్యముఁ జేయ సాహసించితివి? ఇంతకన్నఁ గృపాణముచే నాశిరము ఖండించి యున్నచో నేనీ చింతనందక యుందునుగదా!"యని మదాలస నుద్దేశించి కొంతసేపును "హా! మనోహరా! కళింగరాజ్య సంరక్షణార్థము కుమారుని వైరుల కరాసికి బలిసమర్పించిన నీయర్ధాంగి స్థితి నేడీరీతినిఁ బరిణమించినది. చెఱనుండి బయట పడి నీవెచ్చటికేగితివి? నన్ను రక్షింపరావేమి?" యని విలపింతునిఁగూర్చి కొంతసేపును, రాజకుమారుఁడగు చంద్రశేఖరునిఁగూర్చి కొంతసేపును నేమేమో పరిపరివిధములఁ దలపోయుచుండెను.

---

# పదవ ప్రకరణము.

దేవాంగన విడువఁబడిన యరణ్యమునకుఁ గనుచూపు మేరలో— ఎల్లెడనల్లిబిల్లిగ నల్లుకొన్న పొదరిండ్లకడనుండు మల్లెమొత్తములును, హృదయాహ్లాదకరంబులగు జాజులును, ఘుమ్మఘుమ్మని కమ్మని తెమ్మెరలఁ జిమ్మ సంపెంగలును, మదనునిచేతనుండు ఖడ్గమును సానఁబట్టు నునుపైన పలకరాళ్లోయనఁదగు గేదంగులును, మార్గాయాస సంజనిత తృష్ణా విదారణంబులగు నారికేళంబులును, ఖర్జూర ఖర్జూర పనసనింబాది బహువిధ భూజంబులును, విమలసలిలాసారపూరిత సరోవరంబును, నాసరోవర తీరంబున మత్స్యంబులఁ బట్టుటకై దొంగజపం బాచరించుచు వేచియుండు బకంబులును, ముద్దుపలుకుల రామనామముఁ బలుకు శుకంబులును, లేమావిచిగురులఁ దిని 'కుహూ కుహూ' ధ్వానంబులు సేయు పికంబులును, బురులు విచ్చి యాడుచుఁ దమనఖంబులచే సర్పంబులఁ జీల్చి యొడిసిపట్టు కేకిసముదయములును గలిగి భాసిల్లు నొకరమణీయమైన వనంబుండెను.

అయ్యది మృణాళిని యనుదినంబును విహరించు నుద్యానవనము. కాని విక్రాంతుఁడు మదాలసచే బంధింపఁబడిననాట నుండియు నామె యవ్వనమునకు వచ్చుటయే లేదు. చంద్రశేఖరుని ప్రాణసంరక్షణార్థము దేవాంగనా విక్రాంతు

లెంత పరితాపము నందుచుండిరో, యంతకంటె నెక్కువగ నీమెగూడఁ బరితపించుచుండెను. ఎట్లయినను విక్రాంతుని కష్టములు గట్టెక్కినచో నాతనికి సతియై యలరారవచ్చునని యామె తలంచియుండెను.

నేఁడు చెలికత్తెలగు కుముదయుఁ, గమలయు బలవంతము సేయఁగా నయ్యుద్యానవనంబునకు వచ్చెను. కందనుఁడు గూడ నామెతో నేతెంచెను. ఈతఁడు దేవాంగన బంధింపఁబడిన నాటనుండియు మృణాళిని యొద్దనే యుండెను. మృణాళిని యవ్వనంబున నొక సరోవర తీరంబున నాసీనయై కందనునిఁ జూచి“ కందనా! కూర్మదుర్గమున కరిగిన విక్రాంతుఁడింతవఱకును రాడయ్యెను. ఇంకులకుఁ గారణ మే మై యుండునో? దేవాంగనను గారాగృహమునుండి తప్పించుటకేమైన యత్నముఁ జేయుటకు నాకు శక్యముగాక యున్నది. విక్రాంతుని జెఱనుండి తప్పించిన నాటనుండియుఁ గారాగృహరక్షకులకు మదాలస కఠినమైన యాజ్ఞల నిచ్చియున్నదట!”

కంద:—రాజునిమిత్తము విక్రాంతుఁ డెట్టికష్టముల నైనఁ బొందుచున్నాడు. కుమారమరణంబునకు ధైర్యమువహించెను. భార్య బందిగంబునబడినందులకోర్చెను. చంద్రశేఖర సంరక్షణార్థము కూర్మదుర్గమునకుఁ బరుగెత్తెను. ఈతఁడు పడుచున్న కష్టముల జూచిన నాకెంతయు జాలియగుచున్నది. ఆతఁడరుదెంచి యెట్లో తగినయోధులఁ గూర్చి

కొని మదాలసాగర్వంబు నడంచుటయే కర్తవ్యమని తోచుచున్నది. ఇంతకంటె మఱియొక మార్గము నాకేమి యుం దోచుటలేదు.

మృణా:—నీవుచెప్పినమాట నిశ్చయమే. అతఁడరుదెంచెనేని యేప్రయత్నమైన జేయుటకు వీలుగనుండును.

అంతలో గుముదయుఁ గమలయు మృణాళినిని సమీపించి "చెలీ! ఈసరోవరతీరంబుననే కూర్చుంటివేమి? ఇంచుక కాలమాప్రాంతమున విహరింతము రమ్ము" అనిపలికిరి. మృణాళిని వారింగాంచి "సఖులారా! నాచిత్తము వనవిహారసౌఖ్యంబునందుఁ బ్రవేశించుటకు సమ్మతించుటలేదు. నేడు మీరు బలవంతపఱచుటచేత నిచ్చటికి వచ్చితినిగాని లేకున్న రాకుండెడిదాననే. రాజనిమిత్తము దేవాంగనా వికాంతులష్ట కష్టంబులు బడుచుండఁగాఁ వారికష్టములలోఁ గొంతవఱకుఁ బాల్గొనియున్న నాకిప్పుడీ వనవిహారమేల? ఏనాడు దేవాంగనావికాంతుల కష్టములు తొలంగి, చంద్రశేఖరుఁడు నిజరాజ్య సింహాసన మారోహించునో యానాడు నాకానందమొదవునని తలంపుఁ"డ నెను.

ఇట్లు వీరు సంభాషించుచుండఁగా "హా! నన్నొక వ్యాఘ్రము చంపవచ్చుచున్నది రక్షింపుఁడు. రక్షింపుఁ"డను స్త్రీ యార్తారావము వారికి వినవచ్చెను. "కందనా! నీదగ్గఱ విల్లున్నదిగదా! పాపమెవ్వరో యొకస్త్రీ వ్యాఘ్రమునకుఁ

జిక్కనుండి రక్షణముఁ గోరుచున్నది" యనిపలికి, మృణాళిని యాకందనుని చేతిలోనున్న విల్లునందుకొని, యార్తారావము వినవచ్చిన దెసం బరుగెత్తెను. ఆమెవెంటఁ గందనుఁడును, గుముదయుఁ, గమలయుఁ గూడఁ బరుగెత్తిరి. మృణాళిని యాప్రదేశముఁ జేరునప్పటి కొకవ్యాఘ్ర మొకస్త్రీ కంఠమును బట్టుకొని యుండెను. మృణాళిని యావ్యాఘ్రమును దనవింటిదెబ్బచే నేలఁబడఁగొట్టి, యాస్త్రీని సమీపించెను.

ప్రాణావశిష్ట యగు నాస్త్రీ యెవ్వరు? తనరాజునిమిత్తము వైరులకృపాణమునకు నిజకుమారుని బలియిచ్చి, తుదకుఁ దనప్రాణములు గూడ నేఁడు విడువనున్న దేవాంగనయే. దేవాంగన నట్టిస్థితియందుఁ జూడఁగనే మృణాళిని యొక్కింత కాలము చేష్టారహిత యయ్యెను. కందనుఁడు "దేవీ! నీ కట్టిగతి సంభవించిన" దని విలపించెను. మృణాళిని దేవాంగనను విలోకించి దేవాంగనా! నేను మృణాళినిని. కందనుఁడుగూడ వచ్చియున్నాడు. నీకిట్టిపాటెట్లు సంభవించిన" దని పలికెను. దేవాంగన మృణాళినికి గద్గదస్వరముతో నిట్లుపలికెను. "మృణాళినీ! నీవు సమయమునకు వచ్చితివి. కఠినాత్మురాలగు మదాలస నాగుఱ్ఱిడ్లను వెదకించి, యీప్రదేశమున విడిచిపెట్టించెను. అనవరతము రాజభక్తియే సకలసౌభాగ్యప్రదంబని భావించిన యీదేవాంగన; మనోవాక్కాయ కర్మములయందు విక్రాంతుని దివ్యచరణారవింద సేవతప్ప నన్య

మెఱుంగనియీదేవాంగన; రాజకుమార ప్రాణసంరక్షణార్థము నిజపుత్రుని రిపులయసిచే ఖండింపఁబడుటకుసమ్మతించిన స్వార్థ పరిత్యాగియైన యీదేవాంగన నేడిట్టిదుస్థితిఁ బొందినది. నామరణంబునకు మాత్రము నేను చింతించుటలేదు. కాని, యిట్టిసమయమున నానాథుఁడగు విక్రాంతుఁడు దగ్గఱలేడను చింతయొకటియు, రాజకుమార సంరక్షణార్థము మేమందు చున్నశ్రమ ఫలింపకుండనే పరమేశ్వరుఁడు నన్నుఁ దనసన్నిధికిఁ దీసికొని పోవుచున్నాడను చింతయొకటియు బాధించు చున్నది. ఏమైనను దేనికిని మనము కర్తలముగాము. పూర్వ జన్మమునందు నేనేదో పాపముఁజేసియుందును. తత్పాపఫల మీజన్మమున నీవిధముగా ననుభవింపవలసివచ్చినది ఇట్టి సమయమున భగవంతుఁడు నిన్ను నిఁ గందనునిఁ బంపినందుల కెంతయు సంతసించుచున్నాను. జననీజనకులకన్న, సోదరుల కన్న, బంధుజనంబులకన్న నాయెడల నధికప్రేమఁజూపిన నిన్ను నేను సహస్రజన్మములకైన మఱువఁజాలను. ఇఁక నేను మాట లాడుటకుఁ గూడ శక్తి తగ్గిపోవుచున్నది. తనన్నృపాలుని నిమిత్తము నానాకష్టముల నందుచున్న నానాథునకు నీవు శక్తి యున్నంతవఱకు సంపూర్ణమగు సహాయమొనర్పుము. మదాలసవలనఁ జంద్రశేఖరున కావంతయు హానిగలుగకుండ రక్షించి యాతనినిఁ గళింగరాజ్య భద్రపీఠమున నాసీనుంజేయుటకు నానాథునకు నీవు తోడ్పడుదునని వాగ్దానమిచ్చితివేని, నా

యాశ్మకు ముదంబొదవును. నేను సుఖముగాఁ బ్రాణములఁ విడిచెదను.

దేవాంగనావాక్యము లాలించి మృణాళిని కన్నీరు గార్చుచు "అక్కటా! దేవాంగనా! నీకుసంభవించిన యీగతి కేమని వగతును! మహాపుణ్యచరిత్రవగు నీయెడల భగవంతుఁ డీవిధమునఁ గరుణాదూరుఁడై నందులకు విచారించుచున్నాను. రాజకుమారునిఁ గూర్చి నీవు చింతింపవలదు. మదాలస వలన నాతని కేవిధమయిన హానియు సంభవింపదు. విక్రాంతుఁ డాతనిని సింహాసనాసీనుంజేసి యశమందగలఁడు. కాని యట్టి యానందమును జూచుభాగ్యము నీవు నోచుకొనవైతివి," యని పలికెను.

"హా వీరనారీమణీ! దేవాంగనా! కన్నతల్లి విధమున నాయెడలఁ బ్రేమఁబూని నన్నురక్షించిన నీవు నన్నెడబాసి పోవుచుంటివా! ఇఁకనాకెవ్వరు దిక్కు? నేనెవ్వరిని జేరుదును? పుత్రమరణము వలనఁ గలిగిన దుఃఖము నెట్లోమఱచి రాజు నిమిత్తము తనశరీరమంతయు ధారవోయుచున్న విక్రాంతుఁడు నీమరణమువిని, మనఁగలఁడా! అతనిధైర్యమంతయుఁ జెదరి పోవదా!" యని కందనుఁడు దేవాంగనను జేరి దుఃఖించెను.

దేవాంగన కందనుని గాంచి తడఁబడు మాటలతో నిట్లనెను. "కందనా! నీవు విచారింపవలదు. కళింగరాజసేవకులలో నెన్నికష్టములు వచ్చినను జలింపక, మమ్మొడఁబాయక

భక్తివిశ్వాసములతో మెలఁగినవాఁడవు నీవొకఁడవే. నీవు నాపైఁజూపిన భక్తివిశ్వాసములిఁక మృణాళినిపైఁ జూపుము. ఈమె చెప్పినయట్లు వర్తింపుము. నానాథుఁడగు విక్రాంతుని నెప్పుడును నెడబాయక యాతనికిఁ గుడిభుజమవై యలరారుము. నాగతి యాతనికి వినిపించి యధైర్య మందకుండఁ జేయుము. నావాక్యములుగా నావీరశేఖరున కిట్లు చెప్పుము.

"ప్రాణేశ్వరా! నేటితో నీపదసేవఁ జేయుభాగ్యము నాకుఁదీరిపోయినది. వీరాగ్రేసరుఁడవును, స్వామిభక్తిపరాయణుఁడవును నగు నీకు నేను చెప్పవలసిన దేదియును లేను. నాయెడబాటువలనఁ గలుగుదుఃఖమునకు నీవు చిత్తమునఁ దావీయక కార్యముదెస వర్తింపుము. విక్రమాదిత్యునితోఁ జేసిన ప్రమాణము ననుసరించి, రాజుకొఱకు, ధర్మసంరక్షణము కొఱకు, నెన్నియిక్కట్టులయినఁ బడి చంద్రశేఖరుని సింహాసనాసీనుంగా నొనర్చి కృతార్థుఁడవుగమ్ము. రాజద్రోహులై మహాపాపచిత్తయగు మదాలసం జేరి, దుష్టకృత్యము లొనర్చుచున్న వీరపాల దుర్జయుల శిరంబులను భవత్కృపాణంబున ఖండించి, తద్రక్తప్రవాహమున నభ్యంగనకేళి సల్పి నాయాత్మకు శాంతిఁగూర్పుము. కాలమునకుఁ గట్టుబడి యొరంబెట్టిన కృపాణము నీవలకుఁ దీయుము. ప్రభుభక్తిపరాయణులలో విక్రాంతున కీడెవ్వఁడును లేడనునట్లు నీయశోడిండిమము సకలదిక్కుల మ్రోగించుము."

ఇట్లుపలికి యాదేవాంగన "చంద్రశేఖరుఁడు కళింగ రాజ్యరమావధూటి నాచంద్రార్కతారావనీ శరధిస్థాయిగఁ బాలించుగాక"యని దీవించి, నిమీలితలోచనయయ్యెను. మృణాలిని యామెపైఁ జేయివైచి "దేవాంగనా! దేవాంగనా!"యనిపిలిచెను. ఇఁకనెక్కడ దేవాంగన! ఒక్కనిట్టూర్పు విడిచి యామె ప్రాణములు విడిచెను. కందనుని దుఃఖమునకు మేరలేకపోయెను. పొంగి పొరలివచ్చుచున్న తనదుఃఖప్రవాహము నాపుకొని మృణాళిని కందనుని విలోకించి "వీరపతివ్రతా శిరోమణియగు దేవాంగన మనల నెడఁబాసి పోయినది. ఇఁకఁ మనము చింతించినందువలనఁ బ్రయోజనములేదు. ఈమె పావన కళేబరదహనమును గూర్చి మనమాలోచింపవలయు" ననిపలికి, తానును గందనుఁడును దేవాంగన మృతశరీరము కడనుండి దహన సంస్కారమునకు వలయు ప్రయత్నముతో నిజసేవకులను దీసికొని రమ్మని కమలాకుముదలను గృహమునకుఁ బంపెను.

దేవాంగనా మృతకళేబరము మృణాళిని వనంబునకుఁ జేర్పఁబడెను. "ఆహితాగ్నులును, యజనశీలురును, మహాయోధాగ్రేసరులును, వీరపతివ్రతామణులును, బరమనిష్ఠాగరిష్ఠులై తపంబొనర్చిన మహనీయులును బోవు సుగతికీదేవాంగన పోవుఁగాక"యని మృణాళిని పలుకుచుండఁ, గందనుఁడు దేవాంగనకు దహనసంస్కారాదిక్రియలు యథావిధిగ నిర్వర్తించెను.

---

# పదునొకండవ ప్రకరణము.

అది సంధ్యాసమయము. మంద మలయానిలము డెండములకానందముం గూర్ప వీచుచుండెను. అట్టిసమయమున మందిరోద్యానవనంబున మదాలస యొంటరిగాఁ గూర్చుండి "విశ్రాంతుఁడేమాయెనో! ఆతనిజాడ యొక్కింతయుఁ దెలియకయున్నది? అరణ్యమున విడువఁబడిన దేవాంగన యాప్రదేశమున లేదని తెలియవచ్చినది. ఏవన్యమృగమో యామె నాహారముగాఁ జేసికొని యుండుట నిశ్చయము. ఎంతప్రయత్నించినను జంద్రశేఖరుని దేవాంగన యెచ్చటదాచినదో యావిషయ మెఱుఁగఁజాలక యున్నాను. ఎన్నిక్రూరకృత్యములు ఎన్నిహింసలు జేసినను ఈకళింగరాజ్య సింహాసనమారోహించి నప్పుడుగాని నాస్వాంతమునకు సంతోషమొదవదు. దేవాంగన- తనప్రాణములనైనఁ గోలుపోవుటకు సంసిద్ధయయ్యెనుగాని, చంద్రశేఖరునిజాడ మాత్రమెఱింగించినది కాదు. నేనెంత ప్రయత్నించినను, జంద్రశేఖరుఁడు జీవముతో నున్నంతవఱకు, నాకీరాజ్యము పూర్తిగా వశముకాదు. ఎట్లయిన నాతని నంతమందింప వలయును. ఆతఁడు మడిసెనేని విశ్రాంతుని ప్రయత్నములన్నియు నంతటితో భగ్నమగును. నాప్రయత్నములు ఫలించుటకు నాకపటనాటక ప్రదర్శనంబున వీరపాలదుర్జయులను బాత్రగాఁ జేసితినిగదా! వీరిపై నాకు

నిజముగా మోహమున్నదనియే తలంచుచున్నారు. నా మనోరథ సిద్ధినందు వరకును నేనువారిలో నట్లేవర్తింప వల యును", అని తలంచుచుండెను.

అప్పుడచ్చటికి వీరపాలుఁడువచ్చిఁ "మదాలసా! నేను నీకొక యనుకూలమైనవార్త వినిపించెదను. నాకేమి యొసం గెద", వనిపలికెను. "చంద్రశేఖరుని జాడయేమయినఁ దెలిసి వదా యేమి? నీముఖము కలకల లాడుచున్నది" యని మదా లస వచింప, నందులకు వీరపాలుఁ డిట్లుపలికెను. "నీనిమిత్తము నేనెన్ని శ్రమల నొందుచున్నానో నీవేమయిన గ్రహించు చుంటివా? ఈ వీరపాలుఁ డెట్టులఁగఁ గలిగెను గాని మఱియొక డాచంద్రశేఖరుని జాడ నెట్లుంగఁ గలఁడా! నేటికిఁ బదిదినముల నుండి నిద్రాహారములు లేక నానాకష్టములు బడఁగాఁ దుదకా రహస్యము నేటికి గ్రహింపఁ గలిగితిని. ఆతఁడు మనదుర్జ యుని భార్యయగు సరోజని సంరక్షణంబునఁ గూర్మమర్గమున నున్నవాఁడని వింటిని."

మదా—వీరపాలా! ఈమాట నిజమేనా! నీకెవ్వరు చెప్పినారు?

వీర—నేనసత్యము బలుకుదునా!

మదా—ఇట్టివార్తఁ దెచ్చిన నీకేమిచ్చినను నాకుసంతోషము కలుగదు.

వీర—నీవు మాటలతోడనే నన్ను సంతోష పఱచుచుంటివి.

మదా—నేను నీమీద నెంతయో కోరికచే బగలును రేయియుఁ బరితపించుచు నెప్పుడు మనప్రయత్నములు ఫలించునా యని తలంచుచున్న నన్ను నీవిట్లు పలుకుదువా!

వీర—నేనిట్లు పలికితినని నీకాగ్రహము కలిగినదా! నీకాగ్రహము కలిగినచో నేను తాళఁజాలను. హాస్యమున కట్లు పలికితిని గాని మఱియొండు కాదు.

"ఇప్పటికి మనకుఁ జాదప్రశేఖరుని జాడఁదెలిసినది. ఎట్లయినను నాపురుగును నలిపి వేసితిమేని మనయిచ్చవచ్చిన తెఱంగునఁ జరింప వచ్చును. ఇక్కార్యమున దుర్జయుని నియోగింప వలయును. నీవరిగి యాతని నిచ్చటకుఁ బంపు" మని మదాలస వీరపాలునకుఁ జెప్పెను.

దుర్జయుఁడు వచ్చి "ఇఁకఁ గొలఁది దినములలోనె నా యదృష్టము ఫలించును. మదాలసకు నాయందున్న ప్రేమ వర్ణనాతీతము. ఇట్టి దివ్యలావణ్యసంపన్నవంతి; శరదిందు ప్రతిమాన బింబవదన; ఇంద్రనీలాలక; నన్ను వలచినప్పుడు నేను చేయరాని పనియేమున్నది? కళింగరాజ్య సింహాసన మారోహింప నున్న సుందరాంగి నాకు భార్య యగుచున్నది. ఇట్టిభాగ్యము మఱియెవ్వనికైన లభించునా!" యని మనంబున సంతోషించుచు మదాలసను సమీపించెను. వారిరువురును నీక్రిందివిధమున సంభాషించిరి.

మదా—నేడు నీవెచ్చుటను గనిపింపలేదేమి ?

దుర్జ—కనిపింపకేమి ? బెంగచే నటునిటు నెట్టివానివలెఁ దిరుగుచున్నాను.

మదా—నీకు బెంగయేల ?

దుర్జ—నిన్ను గుఱించియే బెంగ. ఈదాసుని మీద నీకటాక్షవీక్షణంబుల నెప్పుడు ప్రసరింపఁ జేయుదువో ఎప్పుడు నీవును నేను కలిసి సౌఖ్యాంబుధి నోలలాడుదుమో యని నిరంతరము దలంచు చుందును.

మదా—దుర్జయా ! నీకు నిజముగా నాపై మోహమున్నదా! లేదు. లేదు. నీమాట లన్నియు నసత్యమే.

దుర్జ—నామాట లసత్యములా !

మదా—అసత్యములు గాకేమి ! నిజముగా నాపైనీకుమోహమున్నచో నేఁజెప్పిన కార్యమును సాధించియేయుందువు ?

దుర్జ—నీవు చెప్పిన కార్యము నేనుచేయనిదే మున్నది ?

మదా—చంద్రశేఖరుని జాడఁ గనుఁగొంటివా !

దుర్జ—శతవిధములఁ బ్రయత్నము జేయుచుంటిని. ఇంతవఱకును దెలియలేదు.

మదా—ఆవార్త వీరపాలుఁ డెఱుంగఁ జాలినాడు.

దుర్జ—ఆ! నిజముగనే చంద్రశేఖరుని వృత్తాంతము దెలిసినదా! వీరపాలుఁడు నీకుఁజెప్పినాడా! ఇంకనాతఁడు నీయనుగ్రహమునకుబాత్రుఁడగును కాబోలు!

దుర్జయుఁ డామాటఁ బలికినంతనే యామదాలస కొంచెము కోపము నటించుచు "ఛీ! ఎట్టిమాటఁ బలికితివి? ఇట్లు పలుకుటకు నీనాలుక యెట్లాడెను? వీరపాలుఁడా కార్యమును సాధించెనని చెప్పినంత మాత్రమున నాతఁడు నాకుఁ బ్రియుండగును కాబోలునని పలుకుచుంటివా?" యనిపలికెను. "ఆగ్రహింపకుము. నోరుజారినది చెంపలు వేసికొందు" నని పలికి యట్లుచేసి యాదుర్జయుఁ డెదురుగానున్న కొన్నిపుష్పములను దీసికొనివచ్చి మదాలసకిచ్చి "వీని నలంకరించుకొనుము. నేనుచూచి యానందించెద" ననెను.

మదా—దుర్జయా! నావంటివారు పుష్పముల నలంకరింతురా! ఎవ్వరైనఁ జూచిన నవ్వరా!

దుర్జ—ఎందులకు నవ్వుదురు?

మదా—భర్తృవిహీనలు పుష్పములనలంకరింప రాదుకదా!

దుర్జ—నీవు భర్తృవిహీనవా! నన్ను మోహించితినని చెప్పితివే. నేను నీమనోహరుఁడను గాదా! అట్టిచో నీవీపుష్పముల నలంకరించుకొని నాకానందముఁ గూర్పవా!

మదా—నిన్ను నేను వివాహమాడిన పిదపఁ బుష్పముల నలంకరించు కొందును.

దుర్జ—ఇప్పుడు పుష్పములనే యలంకరించు కొననిదానవు నన్ను వివాహ మెట్లాడుదువు? అందులకు లోకము పరిహాసింపదా?

మదా—వివాహమైనచో నవ్వరు. దానిని వితంతూద్వాహ మందురు. అది శాస్త్రసమ్మతము.

దుర్జ—అట్లనా! ఇప్పుడు నాకుఁ దెలిసినది. నామనస్సున కానందము కలిగినది. నీనిమిత్తము తెచ్చిన యీపుష్పము లను నావలఁ బాఱవేయుటకు నాచిత్తము సమ్మతింపదు. కావున నీపాదకమలముల నైన యీపుష్పములతోఁ బూజ జేసి సంతృప్తి పడుదును.

అని చెప్పి, యాదుర్జయుఁడు కొన్ని పుష్పములను మదాలస పాదములపై వైచి పూజసేయఁ దొడఁగెను. ఆతని కృత్యములకు మదాలస తనలో నవ్వుకొనుచు "దుర్జయా! నీవిటఁ గూర్చుండుము. నీతోఁ గొంతరహస్యము మాట్లాడ వలసి యున్న" దని చెప్పినంతనే దుర్జయుఁ డామె ప్రక్కనున్న పీఠ ముపైఁ గూర్చుండి "ఇప్పుడు మనమెట్లుంటిమి. భార్యాభర్తల వలె నుంటిమి. రాజు-రాణివలె నుంటిమి. అవునా! కాదా!" యనెను. "కాకేమి నేను రాణి నైన నప్పుడు నీవు రాజువు కావా! ఈశ్రమలనన్నియుఁ బడుట యెందులకు? ఇందు నిమి త్తమే కదా" యని పలికి, యామదాలస యాతని కిట్లనెను.

దుర్జయా! మనయభీష్ట మెట్లయినను ఫలించుట కింత వఱకును మన మనేక ప్రయత్నములఁ జేసితిమి. ఎన్ని యో శ్రమలఁ బడితిమి. ఎన్ని యో ఘోరకృత్యములఁ జేసితిమి. ఇఁక ద్వరలోనె మనయభీష్టము తీరఁగలదు. కాని యొక్క-

మహాత్కార్యము నీవు చేయవలసియున్నది. చంద్రశేఖరుఁ డిప్పుడు కూర్మదుర్గమున సరోజనీ సంరక్షణంబున నున్నవాఁ డఁట! ఎట్లయినను నీవాకుమారు నిటకుఁ దోడ్కొని రావల యును. ఈకార్యము నీవొనర్చితివేని కళింగరాజ్య పీఠ మవ లీలగ నాకు స్వాధీనమగును. ఇఁక నాపైనఁ జెప్పవలసిన దేము న్నది? నేను కళింగ రాజ్యమునకుఁ బాలకురాలనై యుండ నీవు నాకుఁ బాలకుఁడవై యుందువు. అప్పుడు నీవును నేనును మహానందవారాశిలో నోలలాడుదుము."

"ఏమేనిూ! చంద్రశేఖరుఁడు నాభార్యయగు సరో జనియొద్ద నున్నాఁడా! అట్లయిన సందియమేమి? అతఁడిచ్చట నున్నవాఁడనియే భావింపుము. నేను తెక్కలుగట్టుకొని కూర్మదుర్గమునకుఁబోయియాకుమారునిటకుఁదోడ్కొనివచ్చెఁ దను. ఇందుల కేమియు శ్రమపడ నవసరములేదు. ఈసంగతి యింతకుమున్నే తెలిసియున్నచో నింతయాలస్యముగాకయుండె డిదే. కానిమ్ము. జరిగినదానికి రోూచింపనేల? ఆకుమారునిదో డ్కొనివచ్చుభారము నాయది. పిదప నాయభీష్టముఁ దీర్చు భారము నీయది. శృంగార రసాధిదేవతవు, మోహన దివ్యౌ షధీ ఘుటికవు. నన్ను మోహ శృంఖములచే బంధించి వేసితివి. నీవుచెప్పిన కార్యము నేనుజేసితినేని నాకు బంధమోక్ష మొన రించెదవా? నిస్తులమదనసామ్రాజ్య వైభవమందఁ జేసె దవా? మోహసాగరంబున మునింగియున్న నన్ను నీగాఢా

లింగనంబను నాకచే నుద్ధరించెదవా? సారస కల్హార కైరవవిరాజిత విమలసలిలపూరిత కాసారతీరంబులందును, శుకశారికా మయూరసంతాన భరితమహోద్యానవనంబులందును, బహుళదరీప్రాంత భాసమాన శశికాంత శిలావేదికల యందును, నుదగ్రసితాభ్రపు వినంబుల యందును, నీతో విహరించు నానందముగలుగఁ జేయుదువా?" యని పలికి దుర్జయుఁ డచ్చోటు వాసెను.

మదాలస "నాకార్యము నెఱవేరువరకును, నీతఁడు గాని వీరపాలుఁడుగాని యెట్టిమాట లాడుచున్నను నేనా వంతయుఁ గినుకఁజూపరాదు. అట్లుచూపుదునేని నాకార్య భంగమగును. నాకపటమోహపాశములయందుఁ దగుల్కొని వీరెట్టి కార్యములనైనఁ జేయుచున్నారు," అనితలంచుచు, సూర్యుండ స్తగిరిఁజేరుచుండుటచే యామదాలస మందిరమును బ్రవేశించెను.

---

## పండ్రెండవ ప్రకరణము.

అయ్యది గ్రీష్మఋతువు. ఆయాప్రదేశములందుఁ బానీయ శాల లేర్పడెను. ఎండ మొత్త మతిశయిల్లెను. భూమి యంతయుఁ బ్రద్దలువారెను. పుష్పఫలాళితోఁ బాదపము లన్నియు వాడెను. పశుపక్షి మృగకదంబము తృష్ణచే శోషిం

చుచుండెను. మలయానిల కిశోరములు నశించెను. సుడి గాడ్పులు తమయిచ్చవచ్చినయట్లు చెలరేగెను. చలిపందిరుల యందుఁ బాంధులకు నీరిడు నుపకారులకుఁ దీరిక లేకయుండెను. వనంబులయందు మల్లికా పాటలీ ప్రసవంపుఁ దావులెప్పటికిని దఱుగక యుండెను. సింహ గజశార్దూలాది మృగసముదయములు జలప్రదేశముల విడువక యుండెను. పశునికాయము బంధుర వటచ్ఛాయల నెడబాయక యుండెను.

అట్టికాలమున నొకనాటిమధ్యాహ్నసమయమున నొక పాంథుఁడు తనలో "ఆసరోజని చెప్పినప్రదేశ మింకెంత దూర మున్నదో! విశ్రాంతుఁ డిన్నిదినంబుల నుండియుఁ గూర్జరమార్గ మునఁ జంద్రశేఖరుని యొద్దనున్నాడని తలంచి యచ్చటికిఁ బోయితిని. కానియాతఁ డందు లేడయ్యెను. ఆతఁడు కొంత సైన్యమును సమకూర్చుకొను ప్రయత్నంబున నేగెనని సరోజని యెఱింగించుటచే నీమార్గమున వచ్చితిని. అక్కటా! నేనావిశ్రాంతునకు దేవాంగ నామరణంబు నెట్లువినిపింతును? మానవుని సంతతసౌఖ్యాబ్ధిలో నోలలాడించునది కాంత. సంసారమును వృద్ధిఁజేసి యన్వయంబును నిలుపునది కాంత. శాశ్వతైశ్వర్య భోగంబులఁ గూర్చునది కాంత. స్వర్గశ్రీ సమాశ్లేష సౌఖ్యమిచ్చునది కాంత. అట్టి కాంతలలో దేవాంగన సామాన్యమైనది కాదు. భర్తృసేవాధురంధరి. తనరాజు నిమి త్తము నిజకుమారుని రిపులకృపాణమునకు బలిగా నొసంగుట

కించు కేనియుఁ జలింపని వీరపతివ్రత. ఆమెనురణాంబును విన్నం తనే విక్రాంతుని హృదయ మెట్లగునో కదా'' యని తలపో యుచు నరణ్యమార్గమునఁ బోవుచుండెను.

ఆతఁడు కొంతదూరము పోవునప్పటికి మార్గమునకుఁ బ్రక్కగాఁ గనుచూపుమేరలో నొకకొండ ప్రక్కనున్న సెల యేటి గట్టునఁ గొందఱు మనుష్యులు గూర్చుండి యేదియో యాలోచించుచున్నట్లు గోచరంబై, నెమ్మదిగా నాప్రదేశ మున కేగెను. అదియే సరోజని యాపాంధునకుఁ జెప్పిన ప్రదేశము. విక్రాంతుఁడు - కూర్మదుర్గమునఁ జంద్రశేఖరునిఁ జూచి, యాప్రదేశమును విడిచి యందంకుఁ జరించి, సైన్య మును గూర్చుకొనుచు, నాప్రదేశము నందుండెను. విక్రాం తుఁడు పాంథునిఁ జూచినయంతనే "కందనా! ఈరహస్య ప్రదేశమును నీవుకనుంగొని యెట్లు వచ్చితివి'' యనియడిగెను. పాంథుఁడగు కందనుఁడు విక్రాంతుని స్వరమునుబట్టి యాన వాలు పట్టెను గాని యాతని రూపమంతయు మారి, సన్యాసి వలెనుండెను. కందనుఁడు విక్రాంతునిఁ గాంచి, దేవా! నీనిమి త్తము కూర్మదుర్గమున కరిగి యచ్చట సరోజనిచే నెఱింగింపఁ బడి యిట్లువచ్చితి," ననెను. విక్రాంతుఁడు "కందనా! రాజ కుమారుని నిమిత్తమై నేనుపడుచున్న శ్రమలు.. దేవాంగనను గూర్చివిచారించుటయు గూడ మఱపించుచున్నవి. కారాగార మునఁ జిక్కిన దేవాంగన విధ మెట్లున్నదిక మృణాళినికి సేమమే

కదా”యనెను. కందనుఁడు విక్రాంతుని మాటలకుఁ బ్రత్యుత్త
రము నిచ్చుటకుఁ గొంతసేపు విచారించెను. తుదకు ధైర్య
మవలంబించి, దేవాంగన మరణించిన విధం బెఱింగించెను.
అర్ధాంగి మరణమాలించిన యంతనే విక్రాంతుఁడు “హా! దేవీ!
దేవాంగనా!” యని మొదలుఁ దెగిన కదళీతరువువలె నేలఁబడి
మూర్ఛిల్లి కొంతసేపటికి లేచి, “పతిపదాంబుజ సేవయే
మోక్షమార్గమని భావించి కష్టసుఖములు నాతోసమముగఁ
బంచుకొనిన దేవాంగన; నా మరకాలు తడిగాకుండ నిరంత
రము దనదేహపాటవము నాసేవకై ధారవోసిన దేవాంగన;
సౌశీల్యాదిసుగుణంబుల యందుఁ దోడిభామామణులకు శిరో
మణి యనిపించుకొనిన దేవాంగన; తల్లిదండ్రులకిట్టి పుత్రిక;
సోదరసోదరీమణుల కిట్టిసోదరి; భర్తకిట్టిసతి; బిడ్డలకిట్టితల్లి; సేవ
కులకిట్టిసేవ్యురాలు; నేస్తకత్తెల కిట్టినేస్తకత్తె లేదని జన
వినుతిఁ గాంచినదేవాంగన; తనరాజు నిమిత్తము నిజకుమా
రునిఁ గోలుపోయి, బందిగంబునఁబడి కష్టములకుఁ జలింపని
యువిదేజన చూళికాభరణమగు దేవాంగన; అక్కటా!
నన్నువిడనాడి పోయితివదా” యనిపలువిధంబుల విలపించుచు,
కందనునిఁ జూచి “కందనా! ఆవీరనారీమణి మరణసమ
యంబున నీవు దగ్గఱనుంటుటచే నెంతయు ధన్యుఁడవు. ఆసమ
యంబున నామెనన్నెంతగాఁ దలంచినదో కదా! ఆమెనాకే
మంయనఁ జెప్పుమనెనా” యని యడిగెను. కందనుఁడు దేవాం

గనా సందేశము నాతని కెఱింగించెను. ఆసందేశము వినిన యంతనే విక్రాంతుఁడు మదాలస నుద్దేశించి "క్షుద్రశీలా! మదాలసా! పావన చరిత్రయగు దేవాంగనకుఁ కన్నులు నూడఁ బెఱికించుటకు నీచిత్తమెట్లు సమ్మతించినది ? నిజవల్లభుని, సోదరునిఁ జంపిన కఠినాత్మురాలవగు నీకుఁ బరులపై దయ కలుగునా! ఇంతమందిని హింసించుచున్న నీకువినాశకాల మెప్పుడు వచ్చునోకదా! ఎన్నివిధముల నీవిక్రాంతుని చిత్తమునకు క్షోభఁ గలిగింపఁ దలంచితివో యన్నివిధములఁ గలిగించుచుంటివి. నీవెన్ని హింసల నొనర్చినను గళింగరాజ్య పీఠమున నారాజును కాదని నీవు ఈవిక్రాంతుని కంఠమునఁ బ్రాణములున్నంతవరకు నధిష్ఠింపఁ జాలవు," అనిపలికి మరల దేవాంగనం దలంచి యిట్లనెను. "దేవీ! దేవాంగనా ! మరణ సమయమునందుఁగూడ నీవు కళింగ రాజ్యోద్ధారణమును గూర్చి మఱవలేదుకదా ! నీయమూల్యమైన రాజభక్తిని నేనేమని శ్లాంఘింతును! నారాజును, చంద్రశేఖరునిఁ గళింగరాజ్య సింహాసనమున నాసీనుంజేసి, నీసందేశము ననుసరించి నీయాత్మకుశాంతిఁ గూర్చెదఁగాక ! ప్రభాకరసుధాకరులు సాక్షిగ నందులకై యవసర మయ్యెనేని నాప్రాణములనైన విడిచెద. రాజద్రోహులై మదాలసం జేరిన యామూర్జయవీరపాలురు శ్రీఘకాలములోన నాకరవాలమునకు బలియగుదురుగాక. నీనిర్మల యశోలతలు-

భూమినుండి త్రివిష్టపంబునకుఁ బ్రాకి- యావలస ప్తర్షిమండలం బును దాటి ధ్రువమండలంబున కెగఁ బ్రాకుఁ గాత ! శ్రీమన్నా రాయణుఁడు నిన్ను మహోన్నత పదవియందుంచుఁ గాత"!

విక్రాంతుఁడు కందనునిచే నూరడింపఁబడి తన యను చరులఁ జూచి "నేనిట్టి సమయమున దుఃఖితప్రుఁడనైతినేని కార్యభంగమగును. ఇదిగో! నాదుఃఖమునంతయు మరచిపోవు చున్నాను. చిత్తమున ధైర్యముఁ జేర్చినాను. ఇఁకమనమాల సింపక మదాలసా గర్వోద్రేకంబును, దుష్టకృత్యములను వారింపవలయును. కళింగరాజ్య పీఠమునఁ జంద్రశేఖరుని నాసీనుం జేయనలయును. ఇందుల కవసరమయ్యేనేని మీరంద అును యుద్ధమునకుఁ గూడసంసిద్ధులై యుండవలయును. తన రాజుకొఱకు, ధర్మసంరక్షణముకొఱకు, నవసరమైనచోఁ బ్రతి వీరుఁడును యుద్ధరంగమును బ్రవేశింప వలసినదే. వీరులకు యుద్ధము తెఱచిన స్వర్గద్వారము. వారికి రణభూమియే క్రీడా ప్రదేశము. మన పూర్వులీ ధర్మము ననుసరించియే యుద్ధ ములఁజేసి యశమార్జించిరి".

విక్రాంతుని మాటలు విని యాతనియనుచర యోధులు "విక్రాంతా! నీవుమమ్ముఁగూర్చి యెట్టి సంశయ మును బొందనవసరములేదు. రాజునిమిత్త మనేకకష్టములఁ బొందుచున్న నీవు మాసేవ నీయిచ్చవచ్చినయట్లు గైకొనుము. మేము స్వాభిమానమును నిలుపుకొందుము. మాతృదేశము

నుద్ధరించుకొందుము.'' అని వచించిరి. వారిమాటలు విని విక్రాంతుఁడు కందనునకు వారింజూపుచుఁ "గందనా! వీరంద ఱును నాయెడల నభిమానముఁ బూని. కళింగరాజ్యోద్ధారణ మునకై నాకు సహాయమునరింపఁ దలఁచివచ్చిన వీరాగ్రేస రులు, ఇప్పటికే బదిమంది యోధు లిచ్చటకుఁ జేరినారు. ఇఁక నొకపక్షము దినములలోఁ దక్కినవారు రాగలరు. వారు వచ్చినవెంటనే నేనుకళింగ నగరమునకు వచ్చెదను. ఏది యెట్లున్నను నేను సైన్య సహితుఁడనై వచ్చుట మంచిది. మనశ్రమలింక శీఘ్రకాలములోనే యంతరింపఁగలవు. స్వామి భక్తి పరాయణుఁడవగు నీవు నానిమిత్త మనేక కష్టంబులఁ బడుచుంటివి కదా! ఆకనిపించు పటకుటీరముల యందే మన యోధులందఱు నున్నారు. వారింగూడఁ జూతువుగాక ర''మ్మని పలికి, యాతనిని వెంటఁబెట్టుకొని, యంతకుముందుఁ దనతో మాటలాడుచున్న యనుచరులతో నాప్రదేశమును విడిచెను.

---

# పదమూడవ ప్రకరణము.

"చంద్రశేఖరునిఁ దీసికొనిపోయి మదాలస వశముఁ జేసితి నేని యామెనన్ను సంతోషముఁ బట్టజాలక "నీవే నా నిజమైన మనోహరుఁడవు,'' అనిపలుకుచుఁ గౌఁగలించు కొనును. నిశ్చయముగా నాయందు మోహముండుట చేతనే

నన్నిట్టి కార్యమునందు నియోగించినది! నేను చంద్రశేఖరునిఁ దోడ్కొని పోవుటతో - మదాలస ప్రదర్శించుచున్న చిత్రి నాటక ప్రదర్శనము పూర్తియగును. కళింగ రాజ్యమున కాకాంత పట్టాభిషిక్తురాలగును. నే నామె మనోరాజ్యము నకుఁ బట్టాభిషిక్తుఁడ నగుదును. నామమునకు మాత్రిమామె రాణియై యున్నను, రాజ్యపరిపాలనా భారమంతయు నా పైననే యుండును. ఇట్లు కొన్నాళ్ళు గడచిన తరువాత, నేనే రాజునగుదును. ఆమదాలస నన్నుఁ బరిణయమాడుటకే సమ్మతించు చున్నప్పుడు రాజుగాఁ జేయుటకు మాత్రమేల యంగీకరింపదు! కాని, ఒక్క సంశయము మాత్రము నాకుఁ గలుగుచున్నది. మదాలసను నేను వివాహమాడుటకు సరో జని సమ్మతించునా! ఈకారణమున నేను కళింగరాజ్యమున కేలికనగుదు నని చెప్పినచో నేల సమ్మతింపక యుండును! సమ్మ తింపదా! పోనిమ్ము. ఆకాంత సమ్మతింపలేదని నేను మదాల సను బెండ్లియాడుట మానుదునా! ఏమైనను మానను. ఇఁక మదాలస నాయర్ధాంగి. కళింగరాజ్యము నాయది. మదాలస చిత్తమును నాచిత్తమును నేకమైనచో మమ్మెవ్వ రేమి సేయగలరు," అని - మనంబున ననేక విధములఁ దలం చుచు - దుర్జయుడు - విజయసేన సహితముగాఁ గూర్మకుర్గ ద్వారమును సమీపించి, లోపలికిఁ బోవుచుండెను. ద్వార రక్షక భటులు దుర్జయునిఁ జూచి నీవు దుర్గమును బ్రివేశింప

వీలులేదు," అనిపలికి యాతని ప్రవేశమున కభ్యంతరము గలుగజేసిరి. "దుర్గాధీశ్వరుఁడవైన నీప్రవేశమునకే భటులు సమ్మతించుట లేదు. ఇఁక నీవు రాజకుమారునెట్లు తీసికొని వచ్చెదవు ?" అని విజయసేనుఁడు దుర్జయునితోఁ బరిహాసముగాఁ బలికెను. దుర్జయుఁడు భటులఁజూచి "మీవాక్యము నాకుఁ గడు వింతగనున్నది. దుర్గాధీశ్వరుఁడనైన నేనిందుఁ బ్రవేశింపరాదా! తారతమ్య మరయక యిట్లు పలికిన మిమ్ముఁ గృపవహించి సైరించితి"ననెను.

భటులు—అయ్యా! తారతమ్యము మేమాలోచింపక పోవ లేదు. నీవు దుర్గాధీశ్వరుఁడవని మాకుఁదెలియును. తెలిసియే మేమిట్లు చేయుచుంటిమి. నిన్ను దుర్గములోఁ బ్రవేశింప నీయవలదని సరోజనీదేవిగా రాజ్ఞాపించియున్నారు. మేమామె యాజ్ఞ ననుసరించి వర్తించువారముగా నెఱుంగుము.

దుర్జ—సరోజని నన్నుఁగూడఁ బ్రవేశింప నీయవలదని యాజ్ఞనిచ్చెనా! పొరబాటున నిట్లు పలికితిరేమో యాలోచించుకొనుఁడు."

భటు—ఇందులోఁ బొరబాటేమియు లేదు.

దుర్జ—నన్ను వారించుటకు సరోజని యెవ్వరు?

భటు—ఎవ్వరో మేముచెప్పవలయునా! ఈదుర్గమున నీవడుగుఁ బెట్టి యెన్నాళ్ళయినది. దుర్గపాలకులు తనదుర్గమును

విడిచి యిన్నాళ్ళు పరస్థలంబుల యందు నీవలె నెవ్వరైన నుందురా!

దుర్జ—మీరు నన్ను ధిఃకరించి పలుకుచుంటిరిగా!

భటు—అయ్యా! మాకిది యంతయు నేల? నీరాక నాదేవి కెఱింగించెదము. తరువాత నామెచిత్తము.

ఒక భటుఁడరిగి సరోజనికి దుర్జయుని రాక నెఱింగించెను. అప్పుడామె దుర్గద్వారము నొద్దకు వచ్చి నిలిచి యుండెను. దుర్జయుఁడు సరోజనింగాంచి "ఈభటులు నన్ను లోపలికి రానీయకున్నారు. ఇందులకుఁ గారణమే" మని పలికెను.

సరోజని—నేనే యట్లాజ్ఞనిచ్చితిని.

దుర్జ—కారణమేమి?

సరో—నీవు దుర్గమును బ్రవేశించుట కనర్హుండవు. ఇన్నాళ్ళకియ్యది స్వస్థానమని జ్ఞాపకమునకు వచ్చినదా? దుర్గమేమయ్యెనో, భార్యయెట్లుండెనో యనుసంగతి నీవేమయిన యోచించితివా? పొమ్ము. నీవా కళింగనగరంబున నుష్టచిత్తయగు మహాలసనే యాశ్రయింపుము.

దుర్జ—ఇందులకా నీకాగ్రహము! అచ్చట నేనుండుట వలన మనకెంత లాభముండునో నీవాలోచించితివా!

సరో—అట్లయిన నాలాభమును విడిచి యిచ్చటికేల వచ్చితివి?

దుర్గ—నీయొద్దనున్న చంద్రశేఖరునిఁ దోడ్కొని పోవుటకు.

సరో—సరే! కారణమిప్పుడు తెలిసినది. నాచే రక్షింపఁబడు చున్న చంద్రశేఖరునిఁ దేఱిచూచుటకు నీకును మదాలసకే గాక పురహరునకైనను శక్యముగాదు. రాజ్యకాంక్షను— సోదరుని, భర్తను జంపి, దేవాంగనాకుమారుని గూర్చి— నేడు కళింగ రాజవంశ భూజమును బెల్లగించి వేయుటకై యీకుమారునిఁగూడఁ జంపుటకు నిన్నుఁ దోడ్కొని రమ్మని పంపించినదా? పాపాత్మురాలగు నామె నిన్నుఁ బంపినఁ బంపుఁగాక! యుక్తాయుక్త విచారణశూన్యుఁడవై నీవెట్లు వచ్చితివి? ఇట్టి దుష్కార్యములొనర్చుట మహాపాపంబని నీయాతరాత్మ నీకు బోధించుట లేదా! కుటిలాత్మయగు నామదాలసకు నీవేమని వశమైతివి? విక్రమాదిత్యునకు విశ్వాసపాత్రుఁడవై— దుర్గాధీశ్వరుఁడుగ నున్ననీవు— నేఁడాతనిపైనున్న భక్తినంతయు గంగాస్రవంతియందుఁ గలిపి, విజ్ఞానమంతయు నుంటిపాల్జేసి, చదివినచదువంతయు మాయముఁజేసి- విశ్వాసఘాతుకుఁడవై, రాజద్రోహివై— యీమెంజేరి దుష్టకృత్యము లొనర్చుచుఁ బాపమొడిగట్టుకొంటివా!
నీపాపకార్యములకు నేను సమ్మతింతునని తలంచితివా? అట్లెన్నటికినిఁ దలంపవలదు. నాచిత్తమెప్పుడును సత్యధర్మ పథంబులయందే వర్తించును.

దుర్జ—సరోజనీ! నీవెన్నఁడును నాతో నీవిధమున మాట్లాడి యుండలేదు. నేడతి సాహసము బూనిన విధము గని పించుచున్నది. నీవెట్టిమాటలను గట్టిపెట్టి నామాటలను వినుము. చంద్రశేఖరుని నావెంట బంపుము. దీనివలన నీవుగూడ నెట్టి మహోన్నతపదవికి వత్తువో యోచింపుము.

సరో—చంద్రశేఖరుని మాట నెత్తకుము. అతనిని నీవెంటఁ బంపినచో-మదాలసా కటాక్షము వలన నాకుగొప్పపదవి లభించునని యాశఁ గల్పించుచుంటివా? అట్టియాశకు నీవంటి దుష్టులు లోబడవలయును గాని నావంటి వారెవ్వ రును లోబడరు. గొప్పపదవియే కాదు. ఇంద్రపదవి కన్న నెక్కుడు పదవిలభించినను నాచిత్తము పాపకార్యము లందుఁ బ్రవేశింపదు. ధర్మముకొఱకు- సత్యముకొఱకు- కళింగ రాజ్యోద్ధారణము కొఱకు- చంద్రశేఖరుని నేను రక్షించుచున్నాను. ఇందులకు వ్యతిరేకులై యున్నవారు శీఘ్రకాలములోనే నాశనమగుదురని తలంపుము

దుర్జ—భర్తనగు నాయెడల నిట్లవిధేయతఁ బూని హద్దు మీఱి మాటలాడుచుంటివిగా! ఇంతకును జంద్రశేఖరుని నావెంటఁ బంపెదవా లేదా ?

సరో—నీవునాకు భర్తవైనను - నధర్మ పథానువర్తి వగుట చేతను, బాపరతుఁడ వగుటచేతను నేనింత తీవ్రముగ మాటలాడవలసివచ్చినది. దుష్టకార్యాచరణమును జిత్త

మును బ్రవేశపెట్టి ప్రవర్తించుచున్న నిన్నుఁజూచిన నాకుఁ బాపంబాదవును. ఏనాడునీవు రాజభక్తిని విడిచి ద్రోహివై మదాలసకు దాసుఁడవైతివో యానాఁడే నీకును నాకును ఋణము తీరినది. ఇంతకుమున్ను నాకు నీయందున్న భక్తిని నాహృదయమునుండి తొలఁగించివేసితిని. ప్రేమ నావలకుఁ బాఱదోలితిని. విధేయతను దూరముజేసితిని. సత్య ధర్మ సంరక్షణార్థము నాచిత్తమును గఠినపాషాణ తుల్యముగ నొనర్చితిని. నాకంఠమునఁ బ్రాణము లున్నంతవఱకుఁ జంద్రశేఖరుని స్పృశించుటకైన నెవ్వరును శక్తులుగారు. వీరక్షత్రియకులప్రసూతనగు నేను – చంద్ర శేఖరుని నిమిత్త మవసరమయ్యేనేని ఖడ్గముఁగూడఁ గేలధరించెదను. ఆతనికిఁ బ్రతికూలురగువారి శిరంబులతో గందుకక్రీడ సల్పెదను.

ఇఁక దుర్జయుఁడేమి చేయఁగలఁడు? బలవంతముగ దుర్గములోఁ బ్రవేశింపలేడు. ఇట్టిది సంభవించునని తలంచి, సరోజని ముందుగనే తగినకట్టుదిట్టముఁ జేసియుండెను. విజయ సేనుఁడు దుర్జయునిఁజూచి రహస్యముగా "దుర్జయా! ఇక్కడ నీయాటసాగదు. నీవేమో మదాలసతోఁ జంద్రశేఖరునిఁ దోడ్కొని వచ్చెదనని చెప్పితివికాని ప్రయోజనములేదు. అదియుంగాక, మనము త్వరగా నావలకుఁ బడకుంటిమేని ప్రాణములు గూడఁ దక్కవు," అనిపలికెను.

దుర్జయుఁడు సరోజనిం గాంచి "తక్కిన విషయము లెట్లు న్నను నేను దుర్గములోనికివచ్చుట కభ్యంతర మేమియున్నది?" యని పలుక, సరోజని "నేను చెప్పవలసిన విషయంబు లన్నియు నింతకుమున్నే చెప్పియుంటిని. నీవేమియు నన్నడుగ నవసరము లేదు. ఈదుర్గముతోఁ గాని, నాతోఁగాని నీకేమియు సంబంధము లేదు. నీతో సంబంధలతను నేను త్రెంచివేసి నాను. కళంకచిత్తుఁడవు. దుశ్శీలుఁడవు. స్వామిద్రోహివి. నీ వుండిన నేమి? లేకున్న నేమి? శీఘ్రముగా నిచ్చోటు వాసి పొమ్ము," అని తీవ్రముగ వచించెను. తన ప్రయత్నము సాగ లేదని విచారమును, భార్యచే నట్టియవమానమును బొందుట విజయసేనుఁడు చూచెనని సిగ్గును బొందినవాఁడై - క్రోధము నటించుచు సరోజనిని వీక్షించి "నన్నే యిట్లొనర్చితివిగా! కానిమ్ము. నాదుర్గములో నేనెట్లు ప్రవేశింపఁజాలనో చూచెద గాక" యని పలికి విజయసేనునితో వెడలిపోయెను.

---

# పదునాల్గవ ప్రకరణము.

"దుర్జయుఁడు కూర్మదుర్గమునుండి వచ్చెనని వినియుం టిని; చంద్రశేఖరునిఁ దోడ్కొనివచ్చియే యుండును. ఎందు లకో గాని నాకడకు వచ్చుట కాతఁ డాలస్యము సేయు

చున్నాడు," అని తలంచి, - దుర్జయుని తక్షణము తోడ్కొని రమ్మని మదాలస సేవకున కాజ్ఞాపించెను.

సేవకుఁ డరిగి మదాలస యాజ్ఞఁ దెలిపిన యంతనే దుర్జయునకుఁ జిత్తములో నదియొక విధమైన భయమొదవెను. "నేనిప్పుడేమి సేయుదును ? చంద్రశేఖరునిఁ దోడ్కొని వచ్చితివా యని యడుగు మదాలస కేమని చెప్పుదును? ఆతనిని దోడ్కొని వత్తునని ప్రగల్భములు బలికి యుంటిని. సరోజనిచే నావిధంబునఁ బరాభవమొంది వచ్చితినని పలికినచో నేమనునో? ఏమని యాగ్రహించునో ? ఈకార్యము నేను చేయలేక పోయితినని తన మోహమునకు స్వస్తిఁ జెప్పునేమో ?" యని మనంబునఁ దలంచుచు నాతఁడు తడబడు నడుగులతో మదాలస కడకు వచ్చెను. మదాలస యాతనిం గాంచి "దుర్జయా! కూర్మదుర్గము నుండి నిన్న సంధ్యాసమయము ననే వచ్చితివని వినియుంటిని. వెంటనే నాయొద్దకు రాక తడవుజేసితివేమి ? చంద్రశేఖరునిఁ దోడ్కొని వచ్చితివా ? ఆతని నెచ్చట దాచితివి?" యని యడిగెను. దుర్జయుఁ డందుల కేమని ప్రత్యుత్తర మిచ్చుటకును దోచక కొంతసేపటి వఱకును మాట్లాడక నిలిచియుండెను.

ఆతఁడు నిరుత్తరుఁడై యుండుట వలన మదాలస యను మానమంది "దుర్జయా! మాట్లాడవేమి? కార్యమును సాధించుటకు నీవు సమర్థుఁడవు గాకపోయితివా ! లేక చంద్రశేఖ

రుఁడు సరోజని యొద్ద లేఁడా?" యని యడిగెను. "నేను దాచి
నను విజయసేనుఁడు చెప్పకమానఁడు. ఏమయినను జెప్పక
తప్పదు," అనితలంచి దుర్జయుఁడు తనకు సరోజని వలన
జరిగిన పరాభవ మంతయు నెఱింగించెను.

దుర్జయుని మాటలు వినినయంతనే మదాలస కాగ్ర
హం బొదవెను. ఆమె యాతనిని విలోకించి యిట్లు పలికెను.
"చంద్రశేఖరుని నవలీలఁగ దోడ్కొనివత్తునని ప్రగల్భములు
పలికితివే! నీవేమో కార్యశూరుఁడవని నామనస్సంతయు
నీకుఁ బ్రకటించితిని. ఒకస్త్రీ— అందులో భార్యసంరక్షణంబున
నున్న చంద్రశేఖరునిఁ దోడ్కొని రాఁజాలకపోయితివే!
ఇట్టివా డవసరము వచ్చినచో రణరంగమున నెట్లు నిలువఁ
గలవు? నీవిట్టి యధీరుఁడవని నేను గ్రహింపలేక పోయితిని.
నీకంటె వీరపాలుఁడే నియోగించిన కార్యములఁ దీర్చుట
యందు దక్షుఁడు. ఈకార్యమునందు నే నాతనినైన నియో
గింపక నిన్నుఁబంపి బేలనైతిని. భార్యకు లోబడియుండువాఁడ
వని, భార్యకడ స్వాతంత్ర్యము లేనివాఁడవని భార్యకు భీతిల్లు
వాఁడవని యెఱుఁగఁ జాలనైతిని. నీవంటి పిఱికిపందలను
నమ్ముకొని యేకార్యమునందునుఁ బ్రవేశింపఁగూడదు."

దుర్జయుఁడామె కోపపూరిత వాక్యములు విని "మదా
లసా! నీ వాగ్రహించిన నేను నిలువఁగలనా! నేను నీకటాక్ష
మునకుఁ బాత్రుఁడను. దాసుఁడను. నీదూషణములన్నియు

నాకుభూషణములే. "దాసుని తప్పుదండముతోసరి" యన్నట్లు-ఇదిగో- నీచరణములకు మ్రొక్కుచున్నాను. క్షమింపు"మని యామెపాదములమీఁద వ్రాలెను. "ఛీ! నీముఖముఁ జూచిన పాతకముగూడ నొదవును. ఆవలకుఁ బొ"మ్మని యామదాలస యాతనిని దన్నెను.

దూషణ భూషణ తిరస్కారములు మనదుర్జయునకు సమములే. మదాలస తన్నిన తన్నున కతఁడు లక్ష్యముసేయ లేదు. ఆమెపాదమాతని శరీరమునకుఁ దగులుట మహానంద ముగ భావించి "మదాలసా! నీచరణ తాడనంబున నేఁడు నా జన్మము ధన్యత వహించినది. కాని, నీమృదుచరణ కమల ములు నాశరీరమునకుఁ దగులుటచే మిగులనొచ్చి యరుణ కాంతి వహించినవి. పాపము ! బాధతీరునట్లు పాదము లొత్తనా?" యని మరల నామెపాదములఁ బట్టుటకు సమీపించి యామెచే వారింపఁబడి మరల నామొగాంచి "కూర్మనుర్గము నకు నేను సరియైన ప్రయత్నముతోఁ బోవలేను. అందుచేతఁ గార్యము సాధించలేక పోయితిని. ఈసారి తగిన పరివారముతో బోయి, నీయాజ్ఞయైనచో భర్తనని యించుకంతయుఁ దలఁప కుండఁ బెక్కువిధంబుల నిందించిన యాగర్వాంధకార ప్రమత్త హృదయయగు సరోజనిని; దుర్గములో నడుగుబెట్టనీయక నన్ను వారించిన సరోజనిని; పతియాజ్ఞకు వ్యతిరేకముగాఁ

బ్రివర్తించిన యాసరోజనిని- వేయేల! చంద్రశేఖర సహిత ముగాఁ గాలుని పోలికంపి వచ్చి, నీకరుణకుఁ బాతుఁడ నయ్యెద"నని పలికి యరిగెను.

---

# పదునైదవ ప్రకరణము.

పక్షులాహారమునకై గూండ్లను వదలి పోవుచుండెను. గోపాలకులు గోగణంబును మేతకై గొనిపోవుచుండిరి. ప్రాంతఃకాల వాతూలములు చేతఃప్రీతిగ వీచుచుండెను. అట్టి సమయమున విక్రాంతుఁడు కళింగనగర ప్రాంతమున నున్న మృణాళినీ మహోద్యాన వనంబును బ్రవేశించి, తన్మధ్యమున నపూర్వ శిల్పరచనా నైపుణ్యమును బ్రకటించుచు నిర్మింపఁబడి యున్న తులసికోటను వీక్షించి "ఈవనమధ్యమున మున్ను నేను దీనిని గాంచియుండలేను. ఇయ్యది నూతనముగ నిర్మింపఁబడినట్లు తోఁచుచున్నది" యనితలంచి దానింజూచుటకు సమీపించెను. ఆ తులసికోట ప్రక్కనే జీవకళతో నొప్పారు దేవాంగనా విగ్రహంబొక్కటి యుండెను. దానింగాంచిన యంతనే విక్రాంతుడు - "హా! దేవాంగనా! కళింగ రాజ్యోద్ధారణ భార మంతయు నాపైన విడిచి యద్వితీయమైన రాజభక్తిం బ్రకటించి, నన్ను విడనాడి పోయితివికదా! మరణసమయంబున

నీవు కంచనునకుఁ దెలిపిన సందేశము నాహృదయఫలకమున లిఖించుకొని యుండి, తన్నిమిత్తమే మిగుల కష్టంబు లందుచు నిన్నాళ్ళకుఁ గళింగసీమయం దడుగుఁబెట్టితిని. నీప్రాణ ప్రయాణ సమయమున నిన్నాదరించిన మృణాళినియుఁ గందను డును గృతార్థులుగాని నేను నిర్భాగ్యుఁడనే," యని యనేక విధంబుల శోకించుచు, నవ్వనంబున "నాతులసికోట నెవ్వరు నిర్మించిరి? దేవాంగనా విగ్రహము దానిప్రక్క నిలిపియుండుట కేమికారణ"మని తలంచుచు నచ్చటనే యాసీనుఁడై యుండెను.

అంతఁ గొంతసేపటి కచ్చోటికి మృణాళిని పూజాద్ర వ్యంబులతో నరుదెంచెను. విక్రాంతుఁ డామెం జూచియుఁ దన్నెఱింగింపకుండ నామెవలన నాసంగతి నెఱుంగఁదలఁచి మాటలాడక యుండెను. విక్రాంతుఁడు కళింగనగరమును విడిచి యనేకదినంబు లగుట నేవలమొక సన్యాసివలె నుం డుటచేతను, మృణాళిని యాతని నానవాలు బట్టఁజాలక పోయెను. కాని యాతఁడెవ్వరో యరయఁదలఁచి పూజా ద్రవ్యంబులను దేవాంగనా విగ్రహము ముందుఁబెట్టి విక్రాం తు నవలోకించి "నీవెవ్వరో యొకయతీశ్వరుని వలె నాకుఁ దోచుచున్నావు. ఇచ్చట నాసీనుఁడవై యుంటి వేమి? అది యుంగాక నీముఖము విచారభావమును సూచించుచున్నది. నీవెవ్వరవో, యీసేవకురాలెఱుంగఁ దగునేని యెఱింగింప గోరెదను," అనిపలికెను. విక్రాంతుఁడు "తలోదరీ! నేను

కేవలము సన్యాసినిగాక, సంసారినిగాక, సర్వసౌఖ్యభోగంబుల వర్జించి, నారాజునిమిత్తము-పుత్రకళత్రంబులఁ గోలుపోయి, కార్యదీక్షంబూని నానాస్థలంబుల సంచరించుచున్న యొక నిర్భాగ్యుఁడ" నని యామెకుఁ బ్రత్యుత్తరమిచ్చెను. అట్లు పలికిన యంతనే యాతఁడు విక్రాంతుఁడని తెలిసికొని మృణాళిని "విక్రాంతా! నిన్నెఱుంగఁజాలకపోయినందులకు నన్ను క్షమింపు" మనిపలుకుచు నిట్లనెను. "ధీరపురుషా! రాజసేవాపరాయణా! ఎన్నాళ్ళకు నిన్నుఁ జూడఁగలిగితిని. అగ్నిహోత్రుని సాక్షిగ నిన్నుఁ గైకొన్న దేవాంగన; నాయందతిగౌరవంబునుఁ బ్రేమయు, బూనియుండిన దేవాంగన; దేవతాస్వరూపిణియగు దేవాంగన; మనల నెడబాసిపోయినదికదా! ఆవీరపతివ్రతాశిరోమణి దహనక్రియలు జరుపుమని విధి విరించి నన్ను విధించినాడు."

విక్రాంతుఁడును- మృణాళినియు దేవాంగనా గుణగణంబును దలంచి కొంతసేపు విచారించిరి. విక్రాంతుఁడు మృణాళిని వీక్షించి "పుణ్యవతీ! ఈవనమధ్యమున నీతులసికోట యెందులకు నిర్మింపఁబడినది? ఈదేవాంగన విగ్రహమెట్లు వచ్చినది" యనియడిగెను. "మహానుభావా! దేవాంగన కీప్రదేశమునందే దహనక్రియలు నిర్వర్తింపఁ బడినవి. నాకామెయందున్న భక్తిచే నిచ్చటఁ దులసికోటను గట్టించి, యామె రూపమును దెలుపు నీవిగ్రహంబును బ్రతిష్ఠించితిని. నేనను

దినంబును బరమశ్రద్ధతో నీవిగ్రహంబునకుఁ బూజసేయు
చుందు" నని మృణాళిని యాతనికి బదులుజెప్పెను. మృణాళి
నికి దేవాంగనపైనున్న యమూల్యభక్తికి విక్రాంతుఁ డంత
రంగమున సంతోషించి యామెకిట్లనెను.

"మృణాళినీ! నీఋణమును నేనెన్ని జన్మములకైనను
దీర్పఁజాలను. నీనిర్హేతుకజాయమానకరుణను శ్లాఘించుటకు
నాకుజిహ్వయందుఁ బదములు జాలవు. మహావిపదాబ్ధియందు
మునింగియున్న సమయమున నీవు నౌకవై మమ్ముఁదరింపఁ
జేసితివి. ఇంతవఱకును రాజకుమారుఁడగు చంద్రశేఖరుఁడు
సురక్షితుఁడై యుండుటకు నీదాక్షిణ్య విశేషమే యని చెప్ప
వలయును. కపటసన్యాసివేషమున నన్నుఁ గారాగృహవిము
క్తునిఁగాఁ జేసి రక్షించితివి. ఇఁక దేవాంగనా విషయంబును
గూర్చి నేను పలుకనేల? ఇన్నిమహోపకారంబు లొనర్చిన
నీకు నేనేమిసేయఁగలను? ప్రేమపూర్వకముగ నొసంగు నా
కనకాంగుళీయమును గ్రహించి నన్నుఁగృతార్థునిఁజేయుము."

ఇట్లుపలికి విక్రాంతుఁడు తనవ్రేలినున్న కనకాంగు
ళీయమును దీసి మృణాళినికొసంగెను. మృణాళిని "మహా
భాగా! నేను నీకరుణకుఁ బాత్రురాలనే గాని వినుతికిఁగా"దని
పలికి యాతఁడొసంగిన యుంగరంబును దనవ్రేలికిఁ బెట్టు
కొనెను. అనంతరము విక్రాంతుఁడు "మృణాళినీ! కూర్మమర్గ
మును నేనువిడిచి యనేకకష్టములొందుచు బెక్కుస్థలములఁ

దిరిగి మెట్లో నాకు సహాయముం జేయుటకుం గొందఱు యోధులం జేర్చుకొనం గలిగితిని. వారిలోం గొందఱను గందనుండు గూడ వీక్షించి యున్నాడు. నేనిప్పుడు కొందఱు యోధులతో మాత్రమే వచ్చి యిచ్చటికి నాలుగుక్రోసుల దూరములో విడిసియున్నాను. తక్కినయోధులు గూడ నన్ను చ్చటికి వచ్చి కలసికొనెదరు. వారుగూడ వచ్చిన తరువాత యోచించి చేయవలసినపనిం జేసెదను. ఇంకమనకుం గష్టములు తొలగిపోవునని శుభనిమిత్తంబులు తోచుచున్నవి. గతించిన వారింగూర్చి చింతింపక, కళింగరాజ్య రత్నఖచిత సింహాసనం బునం జంద్రశేఖరుని నాసీనుంజేసి నేను ముదమందెదను - మాకష్టములకుందు బాల్గొనిన నీవును నానందమందంగలవు. ఇచ్చటివార్తలు రహస్యముగాం దెచ్చుచుండుటకుం గందనుఁ డున్నాడుకదా! ఇంక నేం బోయివచ్చెద"నని పలికి యా ప్రదేశమును విడిచెను.

---

# పదునాలవ ప్రకరణము.

ఒకనాడు కళింగనగరమునకు నాలుగుక్రోసుల దూర ములోనున్న యరణ్యమునం బటకుటీరమునందు విశ్రాం తుడు తన యనుచర యోధవర్గముతో నేదియో యాలో

చించుచున్న సమయంబునఁ గందనుఁడాతనికడ కరుదెంచి "దేవా! నేడొక విచిత్రమైనవార్తఁ దెచ్చితి"ననెను.

విక్రాం—కందనా! అయ్యది అంతవిచిత్రమైనదా? అట్లయిన దానిని వినుటకు నాచిత్తము తొందరపడుచున్నది.

కంద—దుర్జయుఁడు - పరలోకసౌఖ్యములనందుట కేగినాఁడు.

విక్రాం—ఏమేమీ! దుర్జయుఁడుమరణించినాఁడా! సుశీలయగు సరోజనికి వైధవ్యదుఃఖ మొదవెనుగదా!

కంద—ఆమెయే యాతనిని జంపించినదఁట!

విక్రాం—కందనా! నీమాట కడువింతగనున్నది. దుర్జయుఁడు కళింగనగరంబున నున్నవాఁడు. సరోజని కూర్మదుర్గమున నున్నది. అట్టియెడల సరోజనియెట్లుదుర్జయునిఁజంపించినది?

కంద:—దుష్టచిత్తయగు మదాలసకుఁ బ్రీతిఁగూర్చుటకై దుర్జయుఁడు విజయసేనుఁడు మొదలయినవారిని వెంటఁబెట్టుకొని కూర్మదుర్గమునకరిగి చంద్రశేఖరుని, సరోజనినిఁ జంపుటకై యత్నింపఁగా సరోజని యాతనింబట్టి తెప్పించి యురిదీయించెను. ఈదారుణకృత్యమును జేయుట కాతనికిఁ దోడ్పడఁబోయినయనుచరులలో ముగ్గురామెచే బంధింపబడిరి. ఒక్కఁడు మాత్రమెట్లో ప్రాణములు దప్పించుకొని కళింగనగరమునకుఁ జేరెనఁట!

కందనుని మాటలువిని విక్రాంతుఁడు "కందనా! సరోజని యొనర్చిన కృత్యములతోఁ బోల్చిచూడఁగా, రాజకుమా

ఘని నిమిత్తము మనముపడుచున్న శ్రమలు శ్రమలుగావనియే తలంపవలయును. దుష్టకార్యాచరణమునందుఁ బ్రవేశించిన నిజభర్తను రాజకుమార సంరక్షణార్థము వధించిన సరోజని సాహసంబును, స్వార్థత్యాగమును, ధైర్యమును, ధర్మపథాను వర్తనమును, సత్యవాక్యపరిపాలనంబును బ్రశంసార్హంబులు. మననిమిత్తమట్టి కార్యమొనర్చిన యామెయెంతయుఁ బూజ్యారాలు. రాజునకై యిట్టి సాహసకృత్యంబొనర్చిన యాసరోజని - వీరనారీమణులైన - హీరాబాయి, దుర్గావతి, లక్ష్మిబాయి - మొదలగువారికీర్తిని మట్టుపఱుపఁజాలినది" యని పలికెను.

ఇట్లువారుసంభాషించుచుండఁగా-దూరమునఁ గొందఱు పురుషులొకశవమును దహనముఁ జేయుటకుఁ గొనిపోవు చున్నట్లు విక్రాంతునకుఁ గనబడ, నతండు కందనునకు దానిం జూపి "కందనా! అయ్యదినిశ్చయముగా శవమేయైనచో-దహనము నిమిత్త మింతదూరము తీసికొనిరావలసినపని యేమున్నది? ఈ ప్రాంతమున నెచ్చటను శ్మశానవాటిక లేదే! వారేదైన ఘోరకృత్యమొనర్చి యాకళేబరమును నట్లుగొనిపోవుచుండి రేమోయని నాకనుమానముగనున్నది. కావునఁ జాలము రమ్ము" అనిపలికి- యనుచరులు కొందరితో బయలుదేరెను. శవాకారముగఁ గట్టఁబడి-వాహకులచేఁ గొనిపోవఁబడుచున్న మృణాళిని వీరింగాంచి "ఓపుణ్యాత్ములారా! అబలనగు నన్ను

దహించుటకు వీరుఁగొనిపోవుచున్నారు. రక్షింపుఁడురక్షింపు"
డని పెద్దపెట్టున నాక్రందనముఁ జేసెను. ఆయార్తారావము
చెవిసోకిన యంతనే విక్రాంతుఁడు "అనుచరులారా! అది
యేదియో ఘోరమే. ప్రాణరక్షణము గోరుచున్న దెవరో
యబలవలెనున్నది. రండు. రండు" అనిపరువెత్తెను. వీరిరాకం
జూచి, మృణాళినిం గొనిపోవుచున్న భటులామెనచ్చట డించి
పరువెత్తసాగిరి. విక్రాంతుని యనుచరులు వారిని వెన్నంటిరి.
విక్రాంతుఁడు-మృణాళినిని సమీపించెను మృతకళేబరమువలె
నామె కట్టఁబడి యుండెను. మృణాళిని విక్రాంతునిఁజూచి
"విక్రాంతా! నాప్రాణరక్షణమునకుఁ బరమేశ్వరుఁడు నిన్నిక్క-
డకుఁ దీసికొనివచ్చినాడు కాబోలు నీవీసమయంబున నిచ్చటికి
రాకయుంటివేని నా జీవయాత్ర నేటితో ముగిసియుండెడిదే!"
యని పలికెను. విక్రాంతుఁడు—"మృణాళినీ! నీకీయవస్థ
యెట్లు సంభవించినది," యని పలుకుచు నామె బంధము
లన్నియు విప్పి, మరల నట్టిస్థితి వచ్చుటకుఁ గారణ మేమని
యడిగెను. విక్రాంతునిఁ గాంచినంతనే భయము వాసినదై
యామృణాళిని యాతని కిట్లు చెప్పెను.

"విక్రాంతా! నిన్నటి యుదయంబున నేను వనంబు
నుండి గృహంబునకేగు సమయంబున మదాలస పంపున
నలువురు భటులువచ్చి నన్ను బంధించుకొని పోయి కారా
గృహంబున బెట్టి, చీకటి పడిన పిదప మదాలస యొద్దకుఁ

దోడ్కొని పోయిరి. ఆమె నన్నుఁజూచి "మృణాళినీ! నీకు సంబంధములేని కార్యములందు నీవు ప్రవేశించుచున్నావు. విక్రమాదిత్య తనూజుఁడైన చంద్రశేఖరుని-సరోజని వశముఁ జేసినది నీవేయనియు, విక్రాంతుని పక్షమూని నావినాశనమునకుఁ బ్రయత్నించుచుంటివనియు నేను వినియుంటిని. ఆ విక్రాంతుని జాడలు నీకుఁ దెలియకుండ నుండవు. కావున నాతఁ డెచ్చటనుండెనో యా రహస్యము నెఱింగింపుము. లేదేని నీకు మరణము నిశ్చయమని యెఱుంగు" మనిపలికెను. అందులకు నే నివ్విషయంబున నేమియు నెఱుంగనని బదులు జెప్పితిని. ఆమె నన్ననేక విధంబుల భయపెట్టెను. నే నావంతయుఁ జలింపక, విక్రాంతుని జాడ నాకుఁ దెలియదనిపలుక, నామె యాగ్రహంబంది నన్ను దహించివేయుఁడని భటుల కాజ్ఞాపించెను. ఆకారణమున మదాలసా సేవకులచే నిచ్చటి కీవిధంబునఁ గొనిరాబడి, నీ వలన రక్షింపఁ బడితిని."

ఆపలుకులు విన్నంతనే విక్రాంతుఁడు మదాలస నుద్దేశించి "క్రూరాత్మురాలా! మదాలసా! ఎన్ని ఘోరకృత్యములఁ జేయుచుంటివి? నీ దుష్కృత్యముల కంతముండదనితలంచితివా! నీకు విక్రాంతుని జాడ కావలయునుగా! విక్రాంతుడు నీ పాలిటికిఁ గాలుఁడై సమీపమునకే వచ్చియున్నాడు. ఇంత వఱకు నీతఁడు కాలమునకుఁ గట్టుబడి యున్నియవస్థలఁ బొందుచు నిల్లుండెను, గాని మరి యొండుకాదు," అని పలికె

మృణాళినింగాంచి "మృణాళినీ! నా నిమిత్తము నీవుగూడ నిట్టి కష్టములనుభవించు చుంటివికదా," యనెను.

విక్రాంతుని యనుచరులు మృణాళిని బంధించుకొని వచ్చినభటులను వెన్నంటి పట్టుకొని తీసుకొని వచ్చి విక్రాంతునిముందు బెట్టిరి. విక్రాంతుడు తన యనుచరులఁ జూచి "క్రూరహృదయయగు మదాలసా ప్రేరేపణంబున నిట్టి ఘోరకృత్యములఁ జేయుటకు సాహసించుచున్న యీ పాపాత్ముల శరీరములపైఁ జర్మమొలిచినను బాపము సంభవింపదు. అయినను వీరివిఁగూర్చి తరువాత నాలోచింతము. ప్రస్తుతము వీరల దీసికొనిపోయి త్రెక్కలు విరచి, మన కుటీరములకుఁ బ్రక్కనున్న వృక్షములకుఁ గట్టుఁ" డని చెప్పఁగా, నాతని యాజ్ఞననుసరించి వారు భటులను దోడ్కొనిపోయిరి. పిదప విక్రాంతుఁడు "మృణాళినీ! నీవిప్పుడు నగరంబునకుఁ బోవలదు. నాకుటీరమున నిర్భయముగా నుండువుగాక" రమ్మని పలికి, యామెను వెంటఁబెట్టుకొని పోయెను.

---

# పదునేడవ ప్రకరణము.

"మహాభాగ్యవంతురాలయ్యును-మృణాళిని యింతవరకును నవివాహితగనుండుట కేమికారణము? ఈమెవివాహము జేసికొనఁదలంచి యున్నచో-నద్వితీయసౌందర్యవతియు, సకల

సద్గుణవతియునగు నీవెను జేకొనుట కెవ్వఁడంగీకరింపక యుం డును. ఈమె తలంపెట్టిదో నా కావంతయుఁ దెలియకయున్నది. ఇదియట్లుండ, నాపై నీమెకిట్టి యమూల్యకరుణాంబర మేశ్వరుఁడు కలగించుట కేమికారణమో! నాజాడ నెరింగింపుమని మదా లస యెంతభయపెట్టినను జలింపక, నా నిమిత్తము తన ప్రాణ ములనయిన, బాయుటకు సమ్మతించిన యీ పర్వేందుముఖి కి నా పైనున్న భక్తిప్రేమాదులు వర్ణనాతీతమై యున్నవి. నాకిట్టి మహోపకారములొనర్చుచున్న యీమెకు నేనెట్టి ప్రత్యుపకారము సేయఁగలుగుదునో తోచకయున్నది," యని విక్రాంతుఁడు పటకుటీరమునందొంటరిగఁ గూర్చుండియాలో చించుచుండెను. అట్టి సమయమున మృణాళిని యాతనికడ కరుదెంచి "వీరపురుషా! నే డెవ్విషయంబుననో గూర్చి దీర్ఘా లోచనము సేయుచున్నట్లున్నావు? అది యెట్టిదో నేను వినఁ దగుదునేని వినగోరెద" నని పలికెను.

విక్రాం—మహాపుణ్యవతివై నన్నుద్ధరించిన నీకెఱింగింపరాని రహస్యముండునా? నాదీర్ఘాలోచన నిన్నుఁ గూర్చియే.

మృణా—నన్నుఁగూర్చియేనా! నేనిచ్చటనుండుటవలన నీకే మయిన నపాయమొదవునేమో యని తలంచుచుంటివా?

విక్రాం—నీవుండుటవలన నాకపాయమొదవునా! అట్లెప్పు డును దలంపవలదు.

మృణా—అట్లయిన నన్నుఁగూర్చిన యాలోచన యెట్టిది?

విక్రాం—నీవు నన్నన్యథా భావించుదానవుగావని నామనం బుననున్న సంశయము నేఁడు నీకెఱింగింపఁ దలంచితిని. అందులకు నీవుసరియైన ప్రత్యుత్తర మిచ్చెదవా?

మృణా—నావిషయంబున నీవేమియు సంశయింపఁబని లేదు. నన్ను నీసేవకురాలిగ భావింపుము.

విక్రాం—సమస్తవిధ సంపదలతోఁ దులఁదూగుచున్న దానవు సౌందర్యఖనివి. అట్టి నీవు పరిణయం బాడక - యీవిధం బుననుండుట కేమికారణము. ఈవిషయంబునుగూర్చి నేను నిన్నడుగఁదలంచియు, నీవేమని తలంతువో యనుసంశ యముచేనూరకుంటిని. నేడునాసందేహానివృత్తిజేయుదువా?

విక్రాంతుని ప్రశ్నకు మృణాళిని యేమని ప్రత్యుత్తర మిచ్చును! ఇంతవఱకును మృణాళిని తన్నుమనంబున వరించి యుండెనని విక్రాంతునకుఁ దెలియదు. ఆమెయు నివ్విష యంబును నాతని కెప్పుడును నెఱింగించి యుండలేదు - ఇప్పు డామె తనభావము నాతనికిఁ దెలియబఱచునా! తెలియఁబఱ చక యుండునా! తెలయఁబఱచక యున్నచో నాతనికిఁ దన కోరిక యెట్లు తెలియును? ఎప్పుడైనను నామెతన కోరిక యాత నికిఁ దెలుపవలయునుగదా! అందుచేత నాతఁ డడిగినప్పుడు తెలుపుటయే మంచిదని తలంచి యామె యాతని కిట్లు పలికెను.

“విక్రాంతా! చిరకాలమునుండి నామనంబున నడంగి యున్నకోరిక నీవడుగుటచే బయలుపఱచుట కిప్పుడవకాశము తటస్థించినది. వీరపురుషుఁడవును, సద్గుణగరిష్ఠుఁడవును, నగు నీయందు నాహృదయము లగ్నమైయున్నది. నాభావము దేవాంగనకును నీకును నెఱింగించి, నీయనుగ్రహము వడసి, నీయంటఁజేరి సౌఖ్యంబుల నందఁదలంచియుండ, మత్పురాకృత కర్మవశంబున నీకన్నియు నిక్కట్టులే సంభవించినవి. ఎప్పటి కైనను ఈ కష్టములు గట్టెక్కకపోవనియు, నాయభిలాష నీ కెఱింగించు నవకాశము తటస్థింపక పోవదనియుఁ దలంచి నీవిమల నామమును నాహృదయ కమలమున నిలిపి, నిరంతర ము జపించుచున్న నాకు మదాలస వలన మరణయోగము గలిగినను, నీచేతఁ రక్షింపఁబడితిని. ఇకఁ గరుణవహించి నన్ను నీ చరణసేవకురాలిగఁ జేసికొని యేలుఁకొనుము.”

విక్రాంతుని చిత్తమిప్పుడు సౌఖ్యభోగంబులకు మిగుల దూరమై యుండెను: కుమారుఁడగు వసంతుఁడును, భార్య యగు దేవాంగనయు మరణించిన నాఁటనుండియు నాతని చిత్తమును వైరాగ్యపథంబునఁ బెట్టి కేవలము యోగివలె నుండెను. కళింగరాజ్యోద్ధారణ కార్యము తప్ప నాతని మనం బున నితరచింత యేమియులేదు. దానిని సత్వరంబుగఁజేసి, దేవాంగనాయాత్మకు శాంతిఁగూర్పవలయునని యాతఁడు దీక్ష వహించి యుండెను. ఇప్పుడు మృణాళిని తన చిత్తమాతనిపైఁ

జిరకాలమునుండి లగ్నమై యున్నదని చెప్పెను. ఆతఁ డెప్పు డును మృణాళినియందుఁ జంచలభావముతో వర్తించి యుండ లేదు. అట్టిచో మృణాళినిని దారగాగ్రహించుట కాతని చిత్త మెట్లు సమ్మతించును ? మృణాళినిమాటలకేమని ప్రత్యుత్తర మిచ్చుటకును దోచక దీర్ఘాలోచనసేయఁదొడంగెను. "నేనిట్లు పలికినయంతనే నీవు యోచించుచుంటివే" మని మృణాళిని యడిగెను.

తనపై మృణాళినికున్న మోహమును ద్రెంపివేయఁ దలఁచి విక్రాంతుఁ డామెంగాంచి నెమ్మదిగా నిట్లు పలికెను.

"ఓ తరుణీ శిరోమణీ! నీవిట్టికోరికఁ బూనియున్నదాన వని నేనింతకు మున్నెప్పుడును నెఱింగియుండలేను. అవ్విషయ మటుండనిమ్ము. ఆలుబిడ్డలఁ గోలుపోయి, సర్వమును వర్జించి, శరీరమాత్ర విభవుఁడనై యున్న నాకు మరల వివాహమేల ? ఇందులకు నాడెంద మణుమాత్రమైన సమ్మతింపదు. నేనిట్లు పలికితినని నీవు మరియొక విధంబునఁ దలంపవలదు."

విక్రాంతుని వైరాగ్యవచనంబులు విన్నంతనే మృణాళిని మొగంబు విన్నబోయెను. "చిరకాలమునుండి యడంచుకొని యున్న నా యభిలాషఁ దెలుపఁగా నీతఁ డిట్లు వచించినాడు. ఇందులకు నేనేమిసేయుదును! ఈతఁడు నన్ననుగ్రహింపనిచో

నేనాజన్మాంతము నిట్లుండవలసినదేనా!" యని తలంచి యామె యాతనింగాంచి "విక్రాంతా! నీవు సమస్త ధర్మముల నెఱింగినవాఁడవు. తన చిత్తమంతయు నీ యధీనముఁజేసి, యెప్పుడు నీకష్టములు గట్టెక్కునా యని, వేయిదేవుళ్ళ కనిశంబు మ్రొక్కుచున్న, ఈ యబల కిట్లు వచించుట న్యాయమా! నేను నీదాన నగుదునని నమ్మియుంటినే! నానమ్మకము వమ్ముజేసెదవా! నీవు నాపైఁ గరుణవహింపవేని నా జీవితము వ్యర్థమేకదా! సుగుణసముద్రా! నీవు నాచిత్తమెట్టిదో యరయఁగోరి యిట్లు వచించుచుంటివేమో! నీవు నాచిత్తమును బరీక్షింపనవసరము లేదు" అని పలికెను. అందులకు విక్రాంతుఁ డిట్లు బదులుచెప్పెను.

"పర్వేందువదనా! నేను నీచిత్తవృత్తిఁ బరీక్షించుట కిట్లు పలికిన వాఁడఁనుగాను. నీచిత్తమతి నిష్కళంక మైనదనియు, నాపై నీకున్నభక్తి వర్ణనాతీతమనియు నెఱుంగుదును. నానిమిత్త మునీవందిన శ్రమలకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను నీయభిలాష ననుసరించి వర్తించుటకు నేనంగీకరింపఁజాలను. నీవునాకుఁ గూతురువంటిదానవు. నాయందునీవు పితృవాత్సల్య ముంచుము. ఇదియేనాకోరిక"

ఆమాటలువిని మృణాళినియేమియు బదులు జెప్పఁజాలక పోయెను. "అహా! ఈతనికిఁ బత్నినై యలరారవలయునని

తలంచిన నాతలంపునకు భంగమొదవెను. ఇఁక నేనీతనిని నిందు విషయమై బలవంతపఱచినను బ్రయోజనముండదు. పరమేశ్వరుఁడు నాయెడల నివ్విధంబున నున్నప్పుడెవ్వరేమి సేయఁగలరు?" అనితలంచుచు విచారచిత్తయై నచ్చటినుండివెడలిపోయెను.

---

# పదునెనిమిదవ ప్రకరణము.

"అక్కటా! నాప్రయత్నములన్నియు విఫలములైనవి. ఎన్ని ఘోరకృత్యము లొనర్చినను దుదకుఁ గార్యముసాధించలేకపోయితిని. అగ్నిహోత్రునిసాక్షిగ నన్నుఁగైకొన్న భర్తను ఏకగర్భసంజనితుండగుసోదరుని-రాజ్యకాంక్షనువహించిచంపిన మహాపాపచిత్తను. నాపాపములకాపరమేశ్వరుఁడెట్టికఠినశిక్షల విధించునో! వసంతదేవాంగనా దుర్జయుల దుర్మరణంబులకు నేనేకదా కారణము. నా దురాగ్రహ మెన్నిహింసల జేయించివది! సాధ్వీశిరోమణియగు దేవాంగనా వాక్యములు సత్యము గాక తప్పునా! జాజ్వల్యమానదావజ్వాల లశ్రమముగహరింపవచ్చును, నానాజగజ్జాలమృత్యువుతోనైనఁ బెనఁగవచ్చును, కఠిన సంజ్వర దుర్యకాకోలగుళికలు మ్రింగవచ్చును. యమదోఃప్రకాండదివ్యచ్ఛండదండంబునైన విఱువవచ్చును. కాని పతివ్రతామణుల శాపవాక్యములఁ దప్పించుకొనుట కెవ్వరికిని

దరము కాదు. రాజకుమారుని నిమిత్తము తనకుమారుని మృతికి సమ్మతించి-తుదకుఁ దానుగూడఁ బ్రాణంబులు గోలుపోయిన దేవాంగనయు, నధర్మపథంబునఁ బ్రవేశించి, దుష్టకృత్యము, జేయసాహసించిన నిజభర్తను జంపిన సరోజినియు, విక్రాంతుని జాడ నెరింగింపక మరణమునకు సంసిద్ధయైన మృణాళినియు . లోకవంద్యులుగదా! మహాపాపకార్యము లాచరించి, నిందఁ బొంది, నేను జగంబున, దలయెత్తి చరింపకుండునట్టి దుర్గతి సంభవించినదికదా! విక్రాంతుఁడెచ్చటనో సైన్యమునుఁజేర్చు కొనివచ్చి, యీనగరంబున కనతిదూరమునఁ బటకుటీరంబుల యందు విడసియున్నాఁడట ఆతఁడు నేడో రేపో నగరంబులోనికి వచ్చి, మహాఘోరకార్యముఁలొనర్చిన నన్ను బ్బంధింపక యుండునా! బంధించి ప్రాణములతో నిలువనిచ్చునా! నేనిప్పు డేమిసేయుదును!" అని మదాలస తనమనంబునఁ దలపోయు చుండెను.

అప్పుడచ్చటికి వీరపాలుఁడువచ్చి మదాలససాంగాంచి "ఆలోచించుచున్నావేమి? ఎవ్వరినైనఁ జంపవలయుననియా లేక యెవ్వరిచేతనైనఁ జంపింపవలయుననియా?"యనియడిగెను.

మదాలస—వీరపాలా! ఎప్పుడును నీవిట్లుపలికి యుండలేదు. నేడిట్లు పలుకుచుంటివేమి?

వీర—ఏమున్నది? నీయాలోచన లంతకంటె నెక్కుడుగ నుండవుకదా!

మదా—ఏమిచేసినను మనము కృతార్థులము గాఁజాలక యున్నాము.

వీర—ఇఁక నీవును నేనును ద్వరలోనే కృతార్థులమగుదుము.

మదా—ఎట్లు ?

వీర—స్వర్గమునకుఁబోయి

మదా—అట్లువచించితివేమి ?

వీర—ఇఁక మనకు గనిపించుచున్న త్రోవ యిదియొక్కటియే. నీకపట మోహాను రాగశృంఖలా బద్ధుడనై ఘోరకృత్యముల నొనర్చిన నాకును, హింసాకార్యములకుఁ బ్రేరేచిన నీకును విక్రాంతుని చేతిలో మరణము తప్పదు. ఆహా ! నీవునన్నను దుర్జయునిఁ బాత్రములుగా జేసికొని, కపట నాటకమును బ్రదర్శించితివి. మేము మూఢులమై - నీచేతిలోని కీలుబొమ్మలమైతిమి. నీప్రేరేపణమునఁజేయఁబోయిన దుష్టకృత్యమునకు ఫలముగా దుర్జయుఁడు - భార్యచేతిలోఁ జచ్చినాడు. నీవును నేనును మిగిలియున్నాము. నీవలన నేను సంపూర్తిగ వచింపఁబడితిని బోనునుండి వెలువడిన సింగము కైవడి, విక్రాంతుఁడు తనఖడ్గమునకు నిన్నును నన్నును నాహారముగా నీయక విడువఁడు. నీవు కళింగ రాజ్య సింహాసన మారోహించుట యబద్ధము గాని, ప్రేతరాజ్య సింహాసన మారోహించుట నిశ్చయము. నీవొనర్చిన దుష్టకృత్యములకుఁ బశ్చాత్తాపమంది క్షమింపు

మని యాభగవంతునిఁ బ్రార్థింపుము. ఇట్టి పాపచిత్తవగు నిన్ను క్షమింపుమని వేడినంతనే భగవంతుఁడు మాత్రము క్షమించునా! ఇక్కడికే నీమూలమున నేనంతము లేని పాపములు జేసినాడను. ఇఁక నీతో మాటలాడినను నాపాపము మఱింత హెచ్చును.

ఇట్లుపలికి యావీరపాలుఁ డామెమందిరమును విడిచి పోయెను. అంతమునుందే మదాలస చిత్తముకలఁతపడి యుండెను. వీరపాలునిమాటలతో నామెచిత్తమునఁగలఁత మఱింత యధికమయ్యెను. "నాకపటమోహ మీవీరపాలునకుఁ దెలిసి నన్నిట్లు నిందించినాఁడు. ఈతఁడిది బయలుపఱచునేమో యని కూడనామనంబున ననుమానము వొడముచున్నది. అక్కటా! నాజీవితము నేకవిధంబులఁ గళంకమైనదికదా!" యని తలంచి, మరల కొంతసేపు దీర్ఘాలోచనముఁజేసి "రోటఁదలఁదూర్చి రోకటిపోటునకు వెఱవనేల? ఇన్నిహింసాకార్యముల నొనర్చిన నేనిప్పుడు వెనుదీయనేల? ఎట్లయినను నేను విశ్రాంతుని శిబిరమునకుఁబోయి, మాటలతో నాతనిని వశపఱచుకొనఁ బ్రయత్నించెదను. అట్లుకాదేని, గుప్తఖడ్గముచే నాతనిని యమాలయంబునకుఁ బంపివేసెదను. ఇట్లుచేయఁ గలిగితినేని నాచిత్తమునకుఁ గొంత సంతృప్తి కలుగు"నని యామదాలస నిశ్చయించుకొనెను.

ఆహా! ఇన్ని ఘోరకార్యము లాచరించినను తుదకుఁ బశ్చాత్తాపమందక, యింకను విక్రాంతుని మాయోపాయమునఁ జంపఁదలచిన మదాలసాసాహసంబు నేమనఁగలము!

---

# పందొమ్మిదవ ప్రకరణము.

"ఇంతవరకును జంద్రశేఖరునిఁ గూర్చి మదాలస చేసిన ప్రయత్నము లేమియు సాగలేదు. నేనిచ్చట సైన్యముతో నిడిసియుంటినని యామెకుఁ దెలిసియే యుండును. ఇఁక నామె మాయోపాయంబులన్నియుఁ గట్టిఁబెట్టి, నాతోఁ బోరాడుట కెవ్వరినైనఁ బురిగొల్పునా? అట్టి ప్రయత్నము లేమియు లేవని గూఢచారుల వలన విని యుంటిని గదా! ఒక వేళఁ బోరాటము సంభవించినను, నింకులకై సంశయింప నేల? కృపాణంబుఁ గేలదాల్చి రణరంగమున నిలిచితినేని నన్ను మార్కొనఁ గలవాఁ డెవ్వఁడు? చంద్రశేఖరునకు వ్యతిరేకులై యున్న వారి శీర్షంబు నెల్ల ఖండించి, తోరణంబుగఁ గూర్చి, చంద్రశేఖరుని పట్టాభిషేక మహోత్సవ సమయంబునఁ గోట గుమ్మమునకు వ్రేలాడఁ గట్టెదఁగాక! కూర్మదుర్గమునుండి సరోజిని చంద్రశేఖరునిఁ గూడ నిచ్చటికిఁ దీసికొని వచ్చి యుండెను. ఇఁక నాలోచనలతో నేమి పని యున్నది? రెండు

మూడు రోజులలోనే సైన్యసహితముగా నేగి కోటలోఁ బ్రవే శించెదగాక! ఇందుల కెవ్వరు వారించెదరో చూచెద," నని విక్రాంతుఁడు-తన మనంబునఁ దలంచుచున్న సమయంబున సేవకుఁ డొకఁడు వచ్చి "దేవా! మదాలస నిన్నుఁ జూచు టకు వచ్చి వాకిట నిలిచియున్న" దని పలికెను. ఆ మాట విన్నంతనే విక్రాంతున కాశ్చర్యము కలిగి "మదాలస యా నన్నుఁ జూడవచ్చినది! లోపలికి రాని"మ్మని సేవకునకుఁ దెలిపెను.

మదాలస కుటీరములోఁ బ్రవేశించి, ముందు మాట లచేవిక్రాంతునివశముఁ జేసికొనదలంచిన దగుటచే నావిక్రాంతు నిఁగాంచి "విక్రాంతా! నిన్నుఁగని యెన్నియోదినంబులాయెను. నాకారణంబునఁగదా నీవు కళింగనగరమును విడిచి యడవులం దు జరించుచు నానా కష్టములఁ బొందుచుంటివి. ఇట్టి కష్టంబులఁ బొందనేల? నీవు నావాఁడవై సమస్తైశ్వర్యములతోఁ దుల దూగుము. పేరునకు నేను కళింగరాజ్యమునకుఁ బరిపాలకు రాలుగా నుందుననుమాటయేగాని రాజ్యమంతయు నీయది యనియే తలంపుము. ఇంతవఱకును నేను నీయెడలఁ జేసిన దుష్కార్యముల మఱువుము. అద్వితీయ సౌందర్యవతియగు నొకకాంతం దెచ్చినీకు మహావైభవముతో వివాహముఁ జేసెదను. ఇఁకనైనను నీవునామాటలు విని సుఖింపుము. "సిరి రామోకాలొడ్డువారుందురా!," యని పలికెను.

తన రాజునిమిత్తము నేకష్టములనుభవించిన విక్రాంతుఁడు మదాలసా వాక్యంబులాలించి, యచంచలమగు నైశ్వర్య సౌఖ్యముల కాసించియామెకులోబడనంగీకరించునా? ఆతడామె కిట్లుబదులు చెప్పెను.

"మదాలసా! నేను నీమాటల ననుసరించివర్తించుటకు దుర్జయ వీరపాలురుగ నన్నుభావించితివేమో! అట్లెప్పుడును దలంపవలదు. ఎన్నికష్టములు వచ్చినను నేను నా దీక్షను విడచువాడనుగాను. స్త్రీవైన నీవు రాజ్యముపైఁ భ్రాంతిచే నింతవరకు ననేక ఘోరకృత్యములు జేసియుంటివి. ఇట్టికృత్యములఁ జేసితినిగదాయని సంతసించితివిగాని నీవెట్టి దుర్గతిపాలగుదువో తలంపవైతివి. ఇఁక నీపాపము పండు దినములు సమీపించినవి. చంద్రశేఖరసహితుఁడనై యిచ్చటికి వచ్చియున్నాను."

మదాలసయింకను ననేకవిధంబుల నాతనితో బలికెను. తన కపటవాక్యముల కాతఁడు లోబడువాడుకాఁడని బాగుగ గ్రహించి, యామదాలస-ఖడ్గముచే నావిక్రాంతుని కంఠమును బొడువఁబోయెను. ఆ సమయంబున ఁదొందరగా మృణాళిని వచ్చి, మదాలస హస్తంబును బట్టుకొని కృపాణంబును దీసి వేసెను. మదాలస చిత్రరుపువలె నిలఁబడెను. తానుచేయఁ దలఁచిన సాహసకార్యము బయలుపడెననియు, విక్రాంతుఁ

జీకఁ దన్నచ్చటనే చంపివేయుననియుఁ దలంచెను. మృణాళిని మదాలసకిట్లు పలికెను. "క్రూరచిత్తవగు నీ వొనర్చిన మహాపాపకార్యములు జాలక నేను మాయో పాయమున విక్రాంతుని జంప వచ్చితివా! దుష్టచారిణీ! కేవలము రాజ్యపరిపాలనాభిలాష యేమునంబునఁ బెట్టు కొని యెన్ని ఘోరకార్యములయినఁ జేయుటకు సాహసించు చుంటివికదా! నీవు మానవ నారీలోకంబునజనించిన రాక్షసివి గాని నిజమైన మానవాంగనవుకావు. నీవు జేసిన పాపములకు యముఁడు ఘోరశిక్షవిధింపకయుండునా! ఆయమలోకంబున నిన్నుఁగింకరు లగ్నిస్తంభముల కంటఁగట్టినప్పుడుగాని నీచిత్త మునకుఁ బశ్చాత్తాప మొదవదు. శూలములచేఁ బొడిచినప్పుడు గాని నీకు బుద్ధికలుగదు. పదపదమని కాలునిదూతలునిన్ను యమలోకమునకుఁ గొనిపోవుట కసిపత్రవనంబు దాటించి నప్పుడుగాని, "దుష్టచిత్తనై ఘోరహింసాకార్యము లొనర్చి యుండుటచే నాకిట్టిగతి సంభవించిన"దని తలంపవు. సత్యవ్ర తుఁడును, ధర్మవ్రతాచారపారీణుఁడును, నగు విక్రమాదిత్యు నకు నీవెట్లు సోదరివై జన్మించితివోకదా! క్షీరజలరాశినిగరళము చందమున సత్యదయాశౌచధర్మములకు నిలయమైన యావం శంబుననీవు జన్మించితివి. ఇప్పుడుమాచేతికిఁ జిక్కితినిన్ను, ఖడ్గముచేముక్కముక్కలుగ ఖండించి, గ్రద్దలకు వేసినను మమ్ము వారించువారెవ్వరున్నారు?"

మృణాళినిపలుకులకు మదాలస యేమయినఁ బ్రత్యు త్తర మీయఁగలదా! ఆమెనోటనుండి మాటవచ్చునా! వేఁట కానివలయందుఁజిక్కిన లేడివలె, భయకంపితచిత్తయై యామె నిలచియుండెను. విక్రాంతుఁడాఁమెంగాంచి 'కులఘ్నీ! రణ రఁగంబులయందు వైరివీరకంఠరంగ ప్రదేశములయందు నాట్య మాడు నాఖడ్గము నీకంఠముపై నటింప సమ్మతింపదు. మహా పాపంబులొనర్చిన దానవైనను - నిన్ను క్షమించి విడుచు చున్నాను. రేపు చంద్రశేఖరుఁడు తన వంశక్రమానుగత మగు కళింగరాజ్య సింహాసన మారోహింపఁగలఁడు. ఇఁక నీగతిఁ జూచుకొమ్ము. పొమ్ము" అనిపలికెను.

విక్రాంతుడిట్లు పలుకుటవిని, మృణాళిని ప్రక్క నే యున్న చంద్రశేఖరుఁడాతనిని విలోకించి యిట్లనెను. "పినతండ్రీ వంటయిల్లుఁజొచ్చిన కుందేలు నెవ్వరైన విడుతురా! నిజసోద రుఁడైన నాతండ్రికి విషంబిడి చంపి మాసింహాసన మాక్ర మింపఁదలంచిన యీపరమ కిరాతకిని; నీకుమారునివధించి, పరమపూజ్యురాలగు దేవాంగన కన్నుల నూడఁబెఱికించిన యీకౄరచిత్తను; మృణాళినిని జీవములతో దహించివేయు టకు నాజ్ఞనిచ్చిన యీరాక్షసినిఁ;నీవుక్షమించి విడచుచుంటివా! ఈకౄరహృదయను జంపుట పాపమని తలంచితివా? జగం బున కపకార మొనర్చు నిట్టి వారియెడల నీవు కరుణవహించితి వేని, యిఁక నధర్మమే ధరాతలముఁ బాలించును. ఏమైనను

నీవీ మదాలసను విడువవలదు. ఈమెను జంపుటకు నీకు సం శయముగ నున్నచోఁ గృపాణ మిటుఁదెమ్ము. మనకిన్ని కష్ట ములు గల్పించిన యీామె జీవయాత్ర నేటితో ముగియఁజేసి యందఱకును సమ్మోదముఁ గూర్చెదను.”

ఇట్లుపలికి యకుమారుఁడు మృణాళిని హస్తమున నున్న ఖడ్గమును దీసికొనఁబోయెను. మృణాళిని చంద్రశేఖ రునిఁ గాంచి “కుమారా! తొందరపడకుము. ఏయుద్దేశముచేత వికాంతుఁడీమె నిప్పుడు క్షమించి విడిచి పుచ్చుచుండెనో మనము గ్రహింపఁజాలము. తన సాహసకార్యము బయలు పడినప్పుడే, యీామదాలస సగము చచ్చినదయ్యెను. అట్టి దానిని నీవు చంపినందువలనఁ బ్రయోజనమేమి యున్నదిశ క్షాత్రవీర రుధిరస్రవంతి నభ్యంగన కేళిసల్పవలసిన కృపాణ మును గాంతపైఁ బ్రయోగింతువా ?” యనెను. అందు లకుఁ జంద్రశేఖరుఁడు “మృణాళినీ ! పాపచిత్తయగు నీమె యెడల నొక్కింతయు దయవహింపరాదు. ఇట్టివారిని వధిం చుట వలన యశమేకాని పాపము సంభవింపదు,” అనిచెప్పి యామెచేతిలోనున్న ఖడ్గమును దీసికొని మదాలస నుద్దేశించి “ఓసీ! కుటిలచిత్తా! అస్మత్రోధ మృగేంద్రమునకు నీవు మత్తేభంబవగుదువు. అస్మత్రోధ పావక జ్వాలకు నీవశ ణ్యాంబవగుదువు. అస్మత్రోధ బడబానలమునకు నీవు పాథో రాశివగుదువు. అస్మత్రోధ వజ్రంబునకు నీవు భూమీ

ధరంబవగుదువు. నీవంటివా రుండిరేని బవిత్ర భూమియైన యార్యావర్తనమునకుఁ గళంకము గూడ గలుగును. ఇదిగో నిన్ను నాఖడ్గంబున కెరగా నిచ్చుచున్నాను.” అనిపలికి యమ్మదాలస మీదకు నేగఁబోయెను. వికాంతుఁడు చంద్ర శేఖరుని చేయిఁబట్టుకొని, “నాయనా! శాంతింపుము. మన శిబిరమును జేరి యీమదాలస దుష్కార్యముఁ జేయుటకు సాహసించిన దగుఁగాక. అంయుసను నీమెను విడిచిపుత్తము. నగ రంబున కేగినను నీమె మనలను దప్పించుకొని యెచ్చటికిఁ బోవఁగలదు?” అని వారించెను. చంద్రశేఖరుఁడు మదాలసం గాంచి “మాపినతండ్రి నన్ను వారించుటచే నీవు నేడు బ్రదికితి” వనెను. వికాంతుఁడు “మదాలసా! నీవలె నేను మాయోపా యంబుల నరయువాఁడను గాను. సైన్యసహితముగా నేను రేపు నగరంబును బ్రవేశించెదను. ఎవ్వరి బలంబునమ్మి నీవిట్టి మహాఘోరకృత్యములఁ గావించితివో వారినందఱిని నన్ను వారింపఁ బంపుము. పొమ్ము” అనిపలికెను. పరాభవ ఖిన్న చిత్తయై మదాలస వికాంతుని శిబిరము విడిచి యరిగెను.

మదాలస యరిగిన కొంచెముసేపటికి వికాంతుని కుటీరమునకు సరోజని వచ్చెను. మృణాళిని సరోజనిం గాంచి “నీవు సమయమునకు లేకపోయితివి. ఇచ్చట నెంతచిత్రమో జరిగిన”దని యామదాలసం గూర్చి చెప్పెను. ఆవృత్తాంతము విన్నంతనే సరోజని వికాంతునిఁ గాంచి “వికాంతా! నీ

యెంత వెఱ్ఱిపనిఁ జేసితివి! చేతికిఁజిక్కిన యామదాలస నట్లు విడిచి వేయుదురా? ఖడ్గముచే నొక్కవ్రేటున నామెశిరమును ఖండించి యుంటివేని దేవాంగన యాత్మకు శాంతికలిగి యుండెడిదికదా! నీచే విడిచిపుచ్చఁబడిన యాదుశ్శీల మరల నెట్టిదోహకార్యము మనంబున నాలోచించి తత్ప్రయత్నము నకుఁ గడంగునో!" యని పలికెను. అందులకు విక్రాంతుఁడు "సరోజనీ! . ఆమెను విడిచిపుచ్చినందునలన మనకావంతయు భయమొదవదు. చేయవలసిన దుష్కార్యములన్నియు నామె యిదివఱకే చేసినది," యని బదులుజెప్పి మృణాళిని కిట్లనెను. "మృణాళినీ! నీకు నేను బ్రాణరక్షణంబొనర్చి తండ్రినైతిని. నాకు నీవు ప్రాణరక్షణం బొనర్చి తల్లివైతివి."

"మాటల సందడిని భోజనంబుల మఱచితిరి. లెం"డని సరోజని పలికిన యందఱును లేచిరి.

---

# ఇరువదవ ప్రకరణము.

విక్రాంతుఁడు చంద్రశేఖర సహితముగాఁ గోటలోఁ బ్రవేశించుననియు రాజ్యకాంక్షను ననేక ఘోరహింసా కార్యము లొనర్చిన క్రూరచిత్తయగు మదాలస కిఁక విక్రాంతుని చేతిలోఁ మరణమో లేక యడవులఁ బట్టిపోవలసిన గతియో సంభవించుననియు, దుష్కృత్యములు జేయుట

యందు మదాలసకుఁ దోడ్పడిన వీరపాలాదులను విక్రాంతుఁడు తనకరవాలమునకు బలిగా సమర్పింపక విడువఁడనియుఁ, గళింగ నగరమునఁ బ్రజలలో గుసగుసలు బయలుదేరెను. అట్టి దుష్కృత్యము లొనర్చిన మదాలసను విక్రాంతుఁడు విడచునా యని కొందఱును నామెతలఁ దఱిగినను బాపము సంభవింప దని కొందఱును, "నిప్పుడిట్టి మాటలతో మనకేమి పని యున్నది ? ఎవ్వరైన విన్నచో మనకేమి ముప్పువాటిల్లునో ! ఊరకయుండుఁ" డని కొందఱును మాటలాడుకొనుచుండిరి.

హిమవత్పర్వతపంక్తి పెట్టని కోటయై, స్నాన మాచరించిన యంతనే సమస్త పాపములఁ బాఱఁదోలు భాగీరథీ ప్రముఖ దివ్యస్రవంతులకు జన్మభూమియై, యనేక వీర క్షత్రియ పరిపాలిత సంస్థానమయంబై, సర్వసస్యసమృద్ధమై, సకలసంపదల కాకరమై, పరమపావన తేజోవిరాజమానమై విరాజిల్లుచున్న భరతవర్షమున బరాక్రమమునకిక్కయు, శౌర్యమునకుఁ బాలవెల్లియు స్వమత స్వగౌరవాభిమానములకు నాలవాలమును నగు సుక్షత్రియ వంశమున జన్మించిన వీరపాలుఁడు మదాలసా కపట మోహ సాగరంబున మునింగి, తన్నుఁ బోషించి మించిన విక్రమాదిత్య నృపాలుని యందున్న భక్తియంతయు మఱచి దుష్కృత్యము లొనర్చెను. నిన్న మొన్నటిదాక వీరపాలుఁడు ప్రభుభక్తి పరాయణుఁడనియు, విశ్వాసపాత్రుఁడనియు జెప్పుకొనుచున్న జనంబు లెల్లరు

నేడాతని కంటెం బాపాత్ముడును రాజద్రోహియు లేడని చెప్పుకొనసాగిరి. ఆతఁడట్టి కార్యములను మదాలసా ప్రేరే పణంబునఁ జేసెనని యాబాలగోపాలమునకుఁ దెలిసినది. కళింగ నగరమున నాతఁడు తలయెత్తి తిరుగుటకు సిగ్గు పడుచుండెను.

విక్రాంతుఁడు సైన్యసమేతముగా నగరంబున నేడో రేపో ప్రవేశించునని యావీరపాలునకుఁ దెలిసి, తనమనంబున "వీరపురుషుఁడనైన నేను నారాజు నుద్ధరించుటకుఁ బ్రయత్న ములు జేయుటకు బదులుగా, మదాలసా వ్యామోహంబునఁ జిక్కి రాజద్రోహ కార్యము లాచరించి జననిందఁ బొందితిని. విక్రాంతుఁడు నన్నుఁ జిత్రవధఁ జేయక విడిచి పెట్టఁడు. నేనాతనికిఁ జిక్కి చచ్చుటకంటె, నేనే ప్రాణములు విడిచెదఁగాక. ఇట్లు నేనొనర్చితినేని నారాజ భక్తికిఁగలిగిన కళంకము మాసిపోవును. చేసిన దుష్కృత్య ములకుఁ బశ్చాత్తాపమంది, వీరపాలుఁ డిట్లొనర్చెనని జనులు చెప్పుకొందురు. అయ్యది నాకు యశంబేగూర్చును. ఇఁక నేనాలోచింపనేల? సత్వరముగఁ బ్రాణములు విడిచి, దివంబు జేరి, యచ్చటనున్న విక్రమాదిత్యుని పాదములపైఁబడి నేనొ నర్చిన పాపముల క్షమింపుమని ప్రార్థించెదఁగాక" యనితలంచి, కరవాలముచేఁ గంఠమును బొడుచుకొని ప్రాణములువిడిచెను.

---

# ఇరువది యొకటవ ప్రకరణము.

విక్రాంతుని కుటీరమునుండి, పరాభవఖిన్నచిత్తయై
వచ్చినప్పటినుండియు, మదాలస నిద్రాహారములకు దూరమై,
పరిపరివిధముల యోచించుచుండెను. ఎంతయాలోచించినను
నామెకు మార్గమేమియుఁ గానిపింపక విచారసాగరంబున
మునింగియుండెను. ఆమె విచారమునకుఁ దోడు, వీరపాలుని
మరణముగూడ వినియుండి, విక్రాంతుని చేతిలోఁజిక్కి చావ
కుండ నాతఁడట్లు ప్రాణములఁ గోల్పోయెనని తలంచెను ఈ
వీరపాలుఁడెప్పుడైన దానాతనియెడలఁ జూపిన కపటమోహ
మును గూర్చి బయలుపఱచునేమోయని యామె సంశ
యించుచుండెను. ఆ కారణమున నాతని మరణమామెకు
సమ్ముదమే గూర్చెను. కాని, తనకెట్టిదుర్గతి సంభవించునో
యని మాత్రమాలోచించుచుండెను. విక్రాంతుఁడు చంద్ర
శేఖర సహితముగా నగరంబును బ్రవేశించినప్పుడు, యత
నిలోఁ బోరాడుట కేమయిన బలమునుఁ బురిగొలుపుద
మన్నను, నందుల కొడంబడువారెవ్వరును లేరు. దుష్కా
ర్యాచరణమందు నామె కెక్కువగాఁ దోడ్పడిన దుర్జయుఁ
డును వీరపాలుఁడును దుర్మరణమందిరి. అయినను నివ్విషయం
బునుగూర్చి యాలోచించుటకుఁ దనయొద్దనున్న యిద్దఱు
ముగ్గురు సేనాధీశ్వరులఁ బిలచి యడిగెను. వారామెం గాంచి

"విక్రాంతుఁడు కాలమునకుఁ గట్టువడి యన్ని కష్టము లను భవించెను గాని మఱియొందుకాదు. అతఁడు మొదట నీచేత బంధింపఁబడకుండ నుండినవాఁడేని, యిప్పటికి మనము యమ పురమునకుఁ బ్రాంతకాపులమై యుందుము. ఆకొన్న సింగము కరణి వచ్చునాతని నెవ్వరు మార్కొనఁగలరు? రణరంగ మున ఖడ్గధరుఁడై యాతఁడు నిలిచెనేని పురహరుఁడైనను నెది రింపఁజాలఁడు. ఇఁక నీమాయలవలనఁగాని, యాతనితోఁ బోరాటమువలనఁ గాని యావంతయుఁ బ్రయోజనము లేదు. "నాయపరాధముల మన్నించి రక్షింపు" మని యాతని పాద ములపైఁ బడుము. ఆతఁడు నిన్నుఁ దప్పక రక్షించును గాని శిక్షింపఁడు. ఇంతకంటె నీకు మేము చూపఁదగిన మార్గమేమి యును లేదు. తరువాత నీయిచ్చవచ్చినట్లు ప్రవర్తింపుము. మేము మాత్రము నీకెట్టి సహాయమును జేయఁజాలము," అని పలికి వెడలిపోయిరి.

తనకు మిగుల దీనస్థితి సంభవించెనని మదాలస మిగుల విచారింప సాగెను. అట్టిసమయమున విజయసేనుఁడు పరుగెత్తు కొనివచ్చి "విక్రాంతుఁడు సేనతోఁ గోటలోపలఁ బ్రవేశించు చున్నాఁడు. ఇఁక గర్తవ్యముఁ జూచుకొమ్ము. చంద్రశేఖరుని దోడితెచ్చుటకు దుర్జయునితో నేనుగూడఁ గూర్మదుర్గమున కరిగియుంటినని విని నన్నుఁ జంపునేమో! నేనేనారినైన నావల బడి ప్రస్తుతము నాప్రాణముల రక్షించుకొందు"నని పలికి యరిగెను.

అప్పుడు మదాలస తనయంతరంగమున "విక్రాంతుఁ డేక నొకఘడియలో నిందు ప్రవేశించును. ఇప్పుడు నేనాలోచించుచు జాగుజేసితినేని యాతనికిఁ జిక్కుదును. ఆతఁడు నన్నురక్షించుఁగాక! రక్షించినను, రాజ్యముపై వాంఛచేత నెక్కుడుమక్కృత్యములొనర్చి తుదకుఁ గృతార్థురాలను గాక పోయి, జననిందను బొందిన నేను జీవించియున్నందువలన ఫలమేమియున్నది? యుక్తాయుక్తములు విచారింపక మహాపాపము లొనర్చి యిహపరంబులకుఁ జెడితిని. నాపాపముల క్షమించి రక్షింపుమని శ్రీహరినిఁ బ్రార్థించి తనువు విడిచెదఁగాక!" యని తలంచి కోటలోనున్న దేవాలయంబును బ్రవేశించి, ముకుళిత కరకమలయై శ్రీహరి నిట్లు ప్రార్థించెను.

"దేవా! నీవు సమస్త జీవకోటికిని నాధారభూతుఁడవు. సకల భూతముల యందును నంతర్యామివై వర్తించుచుందువు. అనంత శక్తివంతుఁడవు. ఆది పురుషుఁడవైన నీ వొక్కరుఁడ వయ్యును, జగంబులను నిర్మించి, యా యా రూపములతో వర్తించుచు, స్వశక్తిచే లోకములఁ బాలించుచుందువు. నీ మహామహిమ వర్ణించుటకు బ్రహ్మరుద్రామరేంద్రాదులే శక్తులుగారఁట. అట్టిచో నబలనగు నేనెంతదాన! వృక్షముల యందగ్నిచందమున నీవు ప్రపంచమంతయు నిండియుందువు. జనన మరణ రహితుఁడవైన నీ మాయచే మోహితులై కొందఱు జనులు సంసార సంబంధమయిన సౌఖ్యములను,

భోగభాగ్యములను గోరుచుందురు. రమారమణా ! ఎవ్వరు నీపైఁ జిత్తము నిలిపి భజింతురో, వారు దుస్సహమైన సంసార సాగరంబును దరించి ప్రకాశించెదరు. జగదీశ్వరా ! కల్పాంత సమయమున సమస్త ప్రపంచమును హరించి శేషపర్యంక మున యోగనిద్రనుండి నాభీకమలమునుండి బ్రహ్మను ప్రాదుర్భవింపఁ జేసిన పరబ్రహ్మమూర్తివగు నీకు నమస్క రించుచున్నాను. నిష్ఠయు, దొంగజపంబును, వ్రతాపపౌరుషం బులును, నీ చిత్తమును రంజిల్లఁజేయఁజాలవు. విజ్ఞానంబు నందును, దానధర్మ సత్యగుణముల యందును, యజ్ఞముల యందును నేను కడు గొప్పవాఁడనని విఱ్ఱవీఁగు బ్రాహ్మ ణునికంటెను, నీయందుఁ జిత్తముఁజేర్చి మనోవాక్కాయ కర్మంబుల నిన్ను సేవించెడువాఁడు చండాలుఁడైనను బూజ్యుఁడు. ఆపద్బాంధవా! నేనెన్ని జన్మము లెత్తితినో, యింకనెన్ని జన్మములెత్త వలయునో! భగవంతా! సమస్తముఁ దెలిసిన దాననయ్యును, నజ్ఞానమునఁబడి, రాజ్యము నిమిత్త మంతములేని పాపముల నొనర్చి, నేడు నీపాదసన్నిధిని ప్రాణ ములు పరిత్యజించుచున్నాను. తండ్రీ ! నాయపరాధముల మన్నింపుము."

ఇట్లు భగవంతుని వేడికొని కరవాలముచేఁ గంఠమునఁ బొడుచుకొని మామదాలస జీవములు విడిచెను.

# ఇరువది రెండవ ప్రకరణము.

విక్రాంతుఁడు చంద్రశేఖర సహితముగాఁ గోటలోఁ బ్రవేశించెను. రాజేంద్రుండరుదెంచెనని సంతోష సూచనార్థము పౌరులు తమగృహంబులను దోరణంబులచే నలంకరించిరి. విక్రాంతుఁడు చంద్రశేఖరునిఁ జూచి "కుమారా! చంద్రశేఖరా! నేటికి నేనుకృతార్థుఁడ నైతిని. కళింగరాజ్యోద్ధారణమునకై నేను పడిన శ్రమలు ఫలించిన"వని పలుక, నందులకుఁ జంద్రశేఖరుఁడిట్లనెను. "తండ్రీ! జనకుని గోలుపోయిన నన్నుద్ధరించుటకు నీవనేక కష్టములఁ బడితివి. పుత్రకళత్రంబులఁ గోలుపోయితివి. ఎన్నిటికైననునోర్చి, విక్రాంతునివంటి రాజభక్తాగ్రేసరుఁడును, దేశసేవా ధురంధరుఁడును లేడని నీయశోడిండిమము జగంబున మ్రోగించితివి. నీవు కరుణ వహింపకయుందువేని నేనీపాటికెక్కడ నుందునో! కళింగరాజ్యేందిర పరహస్తంగత కాకుండ నన్ను రక్షించిమించిన నీ సమధిక ప్రేమ నేమని కొనియాడుదును! నేనెన్ని జన్మములెత్తినను నీఋణంబును దీర్పజాలను."

విక్రాంతుఁడు చంద్రశేఖరునిఁ గని" కుమారా! పరమేశ్వరుని యనుగ్రహముమనయెడల నిప్పటికి వచ్చినది.నీవిషయమున నేను పడిన శ్రమ యావంతయును లేదు. ఇందుసరోజిని నంతైన శ్లాఘింపవలయును. ఈపుణ్యవతి యమూల్య కరుణా

చేతచే నేను వహించిన కళింగరాజ్యోద్ధారణ దీక్ష ఫలించినది. భవద్రక్షణార్థమై యీవీరనారీమణి నిజ భర్తను జంపి, తన యసమాన రాజసేవాపరాయణత్వము బ్రతి మానవుని హృదయఫలకమునందుఁ బ్రకాశింపఁజేసినది. మన మీమె నెంతైన శ్లాఘింపవలయు," ననెను.

మృణాళిని యక్కుమారునిఁగాంచి, "విక్రాంతునిఁ గూర్చి నేను నీకు విశేషముగఁ జెప్ప నవసరములేదు. నీ నిమి త్తము తన కుమారుని రిపుల యసి కెరగా నర్పించి, తుదకుఁ దానుగూడఁ బ్రాణములు విడిచిన వీరపతివ్రతామణి యగు దేవాంగనయు, నీసరోజనియు నీకు మాతృదేవతలు. వీరి విమల నామముల నీ హృదయఫలకమున లిఖించుకొని నిరం తరము జపింపవలయు" నని పలికిన యంతనే చంద్రశేఖరుఁడు విక్రాంతునితోఁ "దంష్ట్రి! మృణాళినీ మహోద్యానవనంబున నిర్మింపఁబడిన తులసీమందిరంబును - నందుఁ బ్రతిష్ఠింపఁబడిన దేవాంగనా విగ్రహంబును దర్శింపవలయు" ననెను. "చంద్ర శేఖరుని కిరీటధారణమహోత్సవ మాదేవాంగనా విగ్రహము సన్నిధియందేఁ జేయువలయు," నని సరోజని చెప్పెను.

ఇట్లు వారు సంభాషించుచున్న సమయమున విక్రాం తుని యనుచరులు మదాలసచే మృణాళినినిఁ జంపుట కాజ్ఞా పింపఁబడి బంధింపఁబడిన భటులను దీసికొనివచ్చి విక్రాం తుని ముందుఁబెట్టి "దేవా! వీరికి శిక్షయెట్టిదో యానతీయుఁ"

డనిరి. విక్రాంతుఁడు వారి శిక్షంగూర్చి మృణాళినియే చెప్ప వలయునని పలికెను. మృణాళిని విక్రాంతు నవలోకించి "ఈదు రాత్ములు మదాలసా ప్రేరేపణంబున నాప్రాణములఁ దీయ నెంచిన వారైనను నిది శుభసమయమగుటచే విడిచి పుత్త్ర" మని పలికి, యట్లు చేయించెను.

ఆమఱునాడు విక్రాంతుఁడు చంద్రశేఖరయుతుఁడై మృణాళినియు సరోజనియు వెంటరా మృణాళిని వనంబుననున్న తులసీమందిరంబునకు మహావైభవముతో నేగెను. తమ రాజ చ్ఛటికి వచ్చునని యెఱింగి, పౌరులంతకుముందే చేరుకొని యుండిరి. చంద్రశేఖరుఁడు తులసీమందిరంబును బ్రవేశించి యందుఁ బ్రతిష్ఠింపఁబడియున్న దేవాంగనా విగ్రహమునకు మ్రొక్కెను. విక్రాంతుఁడు దేవాంగన నుద్దేశించి "నీవు బ్రదికి యున్నచో నీసమయంబున నెంతసంతోషించి యుందువో కదా! ఇదిగో! నీసందేశము ననుసరించి, చంద్రశేఖరునిఁ గళింగ సామ్రాజ్యాభిషిక్తునిఁ జేయుచున్నాను. నీయాత్మకు శాంతి కలుగుఁగాక" యనిపలికి, రత్నకిరీటమును చంద్రశేఖరుని శిర ముపైఁబెట్టఁబోయెను. అప్పుడు చంద్రశేఖరుఁడు "తండ్రీ! నాని మిత్త మనేక శ్రమలుపడి ప్రాణములు విడిచిన నాపినతల్లియగు దేవాంగన నాకు మాతృదేవత. ఈమెయందుండు నాభక్తినిఁ బ్రకటించుటకై కిరీటమును దేవాంగనావిగ్రహమున కలంకరించు

చున్నాను. ఇంతటినుండి ఈ కళింగరాజ్యము "దేవీ దేవాంగనా రాజ్య"మని వ్యవహరింపఁబడుగాక" యని పలికెను. తరువాత విశ్రాంతుఁ డచ్చటనున్న పౌరులనుజూచి "నేటినుండి మీకీత డొడయఁడు. ఈతని తండ్రియగు విక్రమాదిత్యునియందెట్టి భక్తివిశ్వాసములతో మీరు మెలంగితిరో యట్లే యీతని యందుఁగూడ నుందురుగాక యని నమ్ముచున్నా"నని పలికి చంద్రశేఖరున కిట్లు చెప్పెను.

"కుమారా! నేడీకళింగరాజ్యేందిరకు నీవేలికవైతివి. నీవీమెనతిజాగరూకతతోఁ గాపాడుకొనవలయును. రాజనామ మున్నంతమాత్రముచేతనే రాజుగాఁడు. చిత్రాభరణపటస్థితిం బ్రకాశించుట; చామరానిలావృతినిఁ గనుట; భోగతుందిల కాయమున విఱ్ఱవీఁగుట; మానస్వభావపు మతిమెనయుట; వాద్యధ్వనితో వెడలుట; పరుల దూరంబుగాఁబడదరుముట; తనవారి వాక్యము లాలించి తలయూచుట మొదలగు గుణములు రాజునకేగాక గంగిరెద్దునకుఁ గూడ గలవు. కావున నీవీ రాజనామమును సార్థకముఁ జేసికొని యభియాతి వ్యూహావిజ్ఞాత సర్వాశోత్కృష్ట విజయుఁడవై, సామంత దుర్గాధీశ్వరులు యుష్మదాజ్ఞాశశ్వద్వశవర్తులౌగతి రాజ్యేందిర నేలుకొనుము. దురాత్ములై కుట్రలుబన్ను రాజద్రోహిమండలమునకు గుండెదిగులై, ఆశ్రయించిన దీనకోటికిఁ దంగేటి జున్నై, ధర్మమార్గమున మెలంగఁగోరు సుగుణశీలుర కరచేతి

వెన్నయై, రాజ్యంబునకుఁ జేటుఁగూర్పఁ దలఁచు పరరాజుల పాలిటికి ధూమకేతువై భవత్పరిపాలనము వర్ధిల్లుఁగాక! ఆయురారోగ్యైశ్వర్యములును, జయనయోన్నతులును, స్వప్రజానంద ప్రశస్తశీలమును, క్ష్మారక్షణోద్యోగ శక్తియు, సత్యవాక్య ప్రతిష్ఠాపనామతియు, జండశాసన గుణార్జవమును, వైరినిర్దళణ వ్యాపారరతియు మహేంద్ర భోగము, నిచ్చి హరిహర బ్రహ్మలు నిన్నాచంద్రార్క తారావనీ శరధి స్థాయిగ రక్షించెదరుగాక. భవత్పరిపాలనా వైభవము సత్కవి పుంగవుల నిర్మలవాణిచేఁ గీర్తింపఁబడుఁగాక!

భూసురులు-తథాస్తు, తథాస్తు-అనిరి.

# ఉపసంహారము.



చదువరులారా! తను రాజు నిమిత్త మెవ్వ రెట్టిశ్రమల నందియుండిరో మీరు చూచితిరి కదా! ఎన్ని కష్టములకైన నోర్చి చంద్రశేఖరునిఁ గళింగ రాజ్య పీఠమున నాసీనుం జేసి కృతార్థుఁడైన విక్రాంతుఁ డేమయ్యెను? విక్రాంతునియందుఁ జిత్తము నిలిపి, తుదకు భగ్నమనోరథయైన మృణాళిని గతి యేమయ్యెను? కూర్మనగరాధీశ్వరుఁడగు దుర్జయుని భార్యయైన సరోజని యెట్లుండెను? ఈవిషయములనుగూర్చి మీరాలోచించుచుందురేమో!

విక్రాంతుఁడు చంద్రశేఖరుని సింహాసనాసీనుం జేసిన పిదప, నాతనితోఁ "కుమారా! నాజన్మ మిప్పటికి ధన్యత వహించినది. ఇఁక నా కెట్టి వాంఛయు లేదు. కావున నేను బృందావనంబునకుఁబోయి, శ్రీమన్నారాయణ దివ్యపదారవింద సేవఁ జేసికొనుచు సుఖముగా దినములు గడపెదను. మృణాళినియందును, సరోజనియందును నీవు మాతృభావ ముంచి, కడుజాగరూకతతో రాజ్యము పాలింపుము. ఇంతకంటె నేను నీకు జెప్పవలసిన దేదియును లేదు," అని పలికెను. ఆమాటలు విని చంద్రశేఖరుఁడు మిగుల చింతాక్రాంతుఁడై విక్రాంతుని విలోకించి "తండ్రీ! ఇంతవఱకును నాకై

యనేకశ్రమలందిన నీవిప్పుడు నన్నువిడిచి బృందావనంబునకుఁ బోయెదవా? ఇదెట్టిమాట! నీయనుగ్రహమున సింహాసన మధిష్ఠించిన బాలుఁడనైన నేను - ఈసామ్రాజ్యరథము నడపఁ గలనా? నీవలన నేను నేర్చుకొనవలసిన విషయములనేకములు కలవు. ఆవిషయము లట్లుంచుము. నిన్నువిడిచి నేనొక్క నిముషమైన నుండఁజాల. నీవు నన్నెడబాయుదువేని నాకీ రాజ్యమే యక్కఱలేదు. నీవు నాకడనే యుండవలయును. రాజ్యపరిపాలనా భారమంతయు నీవు వహింపవలయు"నని వచించెను. చంద్రశేఖరుని విడనాడిపోవలదని వికాన్తిం తునకు సరోజనియు, మృణాళినియుఁగూడఁ జెప్పిరి. వికాన్తుఁడిఁక బదులుచెప్పఁజాలక చంద్రశేఖరుని యభీష్టము ననుసరించి తన జీవితశేషమాతనియొద్దనే గడుపుటకు నిశ్చయించుకొనెను. మృణాళినియుఁ దన సర్వసంపదలను చంద్రశేఖరుని వశముగావించి, యాతనియొద్దనే పరమేశ్వరారాధనమున జీవయాత్ర వెడలఁదీయుచుండెను. చంద్రశేఖరుఁడు సరోజనిని గూర్జరమర్గాధీశ్వరిగ నొనరించెను.

సంపూర్ణము.

---

